be the epistle of CHRIST

# క్రీస్తు పత్రిక



JBM 03
Nov-Dec 2021

“రాతిపలక మీద గాని సిరాతో గాని వ్రాయబడక, మెత్తని హృదయములు అను పలకల మీద జీవము గల దేవుని ఆత్మతో మా పరిచర్య మూలముగా వ్రాయబడిన **క్రీస్తు పత్రిక** యైయున్నారని మీరు తేటపరచబడుచున్నారు” (2కొరింథి 3:3)

©BiblePlaces.com

## WESTERN WALL (WAILING WALL) IN JERUSLAEM



Jeriah Bible Mission

# లోపలి పేజీల్లో...

Issue No. 03




సంచిక -01


సంచిక -02


సంచిక -03

ప్రభువునందు ప్రియ సహోదరులారా!

యేసు ప్రభువు కృపను బట్టి ఎంతో శ్రమకోర్చి మేము 'క్రీస్తు పత్రిక' అనే ఈ ద్వమాస పత్రికను ప్రచురిస్తున్నాము. ఈ పత్రికను మీరు చదవడమే గాకుండా మీకు తెలిసిన మన సహోదరులకు కూడా పంపించి చదివేలా ప్రోత్సహించండి. ఇందులో ప్రచురించే ఆర్టికల్స్‌కు సంబంధించి ఏమైనా సందేహాలు వున్నా, సరిచేయాల్సి వున్నా మమ్మల్ని సంప్రదించండి.

ఇది మూడవ సంచిక, మొదటి, రెండవ సంచికలు చదవాలనుకుంటే పక్కన ఉన్న సంచికల ఇమేజ్‌పై క్లిక్ చేయండి లేదా మాకు వాట్సప్ చేయండి.

దేవుడు మనందరికి తోడైయుండి కాచి కాపాడి నడిపించును గాక!

-ఎడిటర్


**Published by :**
Jeriah Bible Mission
Peddapalli, Telangana-505172
7013 63 9470 (Plz Whatsapp only)

**Blog :**
jeriahbiblemission.blogspot.com

**email :**
jeriahbiblemission@gmail.com



**D.T.P. & Designing :**
adept Digitals, Peddapalli. 9395 11 3648

# వాక్యానుసారమైన క్రీస్తు సంఘం...

మొదటి భాగము

మనకు సాధారణంగా సంఘం అనగానే కొంత మంది కలిసి వారి సంక్షేమం కోసం ఏర్పాటుచేసుకున్న కొన్ని సంఘాలు గుర్తుకు వస్తాయి. ఉదాహరణకు కుల సంఘాలు, హమాలి సంఘాలు, కార్మిక సంఘాలు... ఇలా ఉంటాయి. సంఘాలను ఏర్పాటు చేసుకోవడానికి గల ముఖ్యఉద్దేశ్యం సంక్షేమం కోసం లేదా హక్కులు కాపాడుకోవడానికి, ఐక్యత కోసం... ఒకే కోవకు చెందినవారందరు కలిసి ఏర్పాటు చేసుకుంటారు. కార్మికులు, తమ యజమానులు శ్రమ దోపిడి చేయకుండా, తమకు రావాల్సిన జీతభత్యాలు, వేతనాలు కాలానుగుణంగా పెంచుకోవడానికి, ఉద్యోగ భద్రత కోసం, తమ హక్కులు కాపాడుకోవడానికి ఉమ్మడిగా అందరూ కలిసి పోరాడడానికి సంఘాలను ఏర్పాటు చేసుకుంటారు. కులస్తులైతే తమ కులం వారికి సహాయం చేయడానికి, సంక్షేమం కోసం, ఐక్యత కోసం కులసంఘాలను ఏర్పాటు చేసుకుంటారు.

మరి బైబిల్లో చెప్పబడిన క్రీస్తు సంఘం అంటే ఏమిటి? ఏ ఉద్దేశ్యముతో ప్రభువు సంఘముగా కూడుకోమన్నాడు? వాక్యానుసారంగా క్రీస్తు సంఘం గురించి తెలుసుకునే ప్రయత్నం చేద్దాం.

## సంఘం యొక్క మూల పదం :

తెలుగు బైబిల్లో సంఘం అని ఉన్న చోట గ్రీకులో 'ఎక్లేసియా' అనే పదం ఉపయోగించబడింది.

**(G1577) ἐκκλησία, —** *ek-klay-see'-ah*; from a compound of **(1537)** (ἐκ) and a derivative of **(2564)** (καλέω); a *calling out*, i.e. (concretely) a popular *meeting*, especially a religious *congregation* (Jewish *synagogue*, or Christian community of members on earth or saints in heaven or both): — assembly, church.

**(G1537) ἐκ, —** *ek*; or ἐξ, ex; a primary preposition denoting *origin* (the point *whence* motion or action proceeds), *from, out* (of place, time or cause; literal or figurative; direct or remote): — after, among, x are, at, betwixt (-yond), by (the means of), exceedingly, (+ abundantly above), for (-th), from (among, forth, up), + grudgingly, + heartily, x heavenly, x hereby, + very highly, in,...ly, (because, by reason) of, off (from), on, out among (from, of), over, since, x thenceforth, through, x unto, x vehemently, with (-out). Often used in composition, with the same general import; often of *completion*.

**(G2564) καλέω, —** *kal-eh'-o*; akin to the base of **(2753)** (κελεύω); to "*call*" (properly aloud, but used in a variety of applications, dirivative or otherwise): — bid, call (forth), (whose, whose sur-) name (was [called]).

'ఎక్' మరియు 'కలయో' అనే రెండు గ్రీకు పదాల కలయికతో 'ఎక్లేసియా' అనే పదం ఏర్పడింది. ఎక్ అంటే నుండి లేదా బయటకు అని అర్థం. కలయో అంటే పిలవడం అని అర్థం. ఎక్లేసియాకు (నామవాచకం) బయటకు పిలవబడినవారు లేదా ఉన్న స్థితి నుండి

పిలవబడినవారు లేదా ఒక ఉద్దేశ్యంతో పిలవబడినవారు అనే అర్థాలు ఉన్నాయి.

అందుకే అపోస్తలులు ఆయా ప్రాంతాల్లో ఉన్న క్రీస్తుసంఘాన్ని ఉద్దేశించి వివిధ పత్రికలు రాస్తూ వారిని **'పిలువబడినవారు'** అని సంబోధించారు. ఆ వచనాలు ఒకసారి చూడండి;

రోమా 1:2 –"దేవుని సువార్త నిమిత్తము ప్రత్యేకింపబడిన వాడునైన పౌలు రోమాలో ఉన్న దేవుని ప్రియులకందరికి అనగా **పరిశుద్ధులుగా ఉండుటకు పిలువబడిన వారికందరికి** (శుభమని చెప్పి) వ్రాయునది. మన తండ్రియైన దేవునినుండియు, ప్రభువైన యేసు క్రీస్తునుండియు, కృపాసమాధానములు మీకు కలుగు గాక. దేవుడు తన కుమారుడును మన ప్రభువునైన యేసుక్రీస్తు విషయమైన ఆ సువార్తను పరిశుద్ధ లేఖనములయందు తన ప్రవక్తలద్వారా ముందు వాగ్దానముచేసెను. యేసుక్రీస్తు, శరీరమునుబట్టి దావీదు సంతానముగాను, మృతులలోనుండి పునరుత్థానుడైనందున పరిశుద్ధమైన ఆత్మనుబట్టి దేవుని కుమారుడుగాను ప్రభావముతో నిరూపింపబడెను. ఈయన నామము నిమిత్తము సమస్త జనులు విశ్వాసమునకు విధేయులగునట్లు ఈయన ద్వారా మేము కృపను అపొస్తలత్వమును పొందితిమి. మీరును వారిలో ఉన్నవారై **యేసుక్రీస్తువారుగా ఉండుటకు పిలువబడి యున్నారు.**"

రోమా 8:28 –"దేవుని ప్రేమించువారికి, అనగా ఆయన **సంకల్పముచొప్పున పిలువబడినవారికి,** మేలుకలుగుటకై సమస్తమును సమకూడి జరుగుచున్నవని యెరుగుదుము."

1కొరింథి 1:2 –"కొరింథులోనున్న దేవుని సంఘమునకు, అనగా క్రీస్తుయేసునందు పరిశుద్ధపరచబడినవారై **పరిశుద్ధులుగా ఉండుటకు పిలువబడినవారికిని,** వారికిని మనకును ప్రభువుగా ఉన్న మన ప్రభువైన యేసుక్రీస్తు నామమున ప్రతిస్థలములో ప్రార్థించువారికందరికిని శుభమని చెప్పి వ్రాయునది."

1కొరింది 1:24 –"ఆయన యూదులకు ఆటంకముగాను అన్యజనులకు వెఱ్ఱితనముగాను ఉన్నాడు; గాని యూదులకేమి, గ్రీసుదేశస్థులకేమి, **పిలువబడినవారికే** క్రీస్తు దేవుని శక్తియును దేవుని జ్ఞానమునై యున్నాడు."

యూదా 1:1 –"యేసుక్రీస్తు దాసుడును, యాకోబు సహోదరుడునైన యూదా, తండ్రియైన దేవునియందు ప్రేమింపబడి, యేసుక్రీస్తునందు భద్రము చేయబడి **పిలువబడినవారికి** శుభమని చెప్పి వ్రాయునది."

పై వచనాలను, మూల పదాలను బట్టి గ్రహించినట్లయితే క్రీస్తు సంఘము అనగా ఒక ఉద్దేశ్యం కోసం క్రీస్తుచే **'పిలువబడినవారు'** అని అర్థం వస్తుంది. ఇదే భావం మామూలుగా మనం ఉపయోగించే **'సంఘం'** అనే పదం ద్వారా రాదు, ఇది మామూలుగా ఒక గుంపును మాత్రమే సూచిస్తుంది. సంఘం అనే పదాన్ని ఉపయోగించడం ద్వారా క్రీస్తు సంఘానికి ఉన్న ప్రత్యేకత, ప్రాముఖ్యత నిర్వీర్యమైపోయింది. ఇక మీదటనైనా 'సంఘం' అనే పదాన్ని ఉపయోగించకుండా **'పిలువబడినవారు'** అనే పదాన్ని ఉపయోగించడం ద్వారా మనం బైబిలును, దేవుని ఉద్దేశ్యాన్ని మరింత లోతుగా అర్థం చేసుకోగలుగుతాము.

అయితే ఇక్కడ మరో విషయం గమనించాలి; క్రీస్తు సంఘాన్ని 'పిలువబడినవారు' అని మాత్రమే కాకుండా ఏర్పరచబడినవారు లేదా ఎన్నుకొనబడినవారు, రాజులైన యాజకులు, పరిశుద్ధ జనము లేదా పరిశుద్ధులు, దేవుని ప్రజలు, క్రైస్తవులు అని కూడా పిలువబడ్డారు.

1పేతురు 2:9 –"అయితే మీరు చీకటిలోనుండి ఆశ్చర్యకరమైన తన వెలుగులోనికి మిమ్మును పిలిచిన వాని గుణాతిశయములను ప్రచురముచేయు నిమిత్తము, **ఏర్పరచబడిన వంశమును, రాజులైన యాజక సమూహమును, పరిశుద్ధ జనమును, దేవుని సొత్తయిన ప్రజలునై యున్నారు."**

యూదా 1:3 –"ప్రియులారా, మనకందరికి కలిగెడు రక్షణనుగూర్చి మీకు వ్రాయవలెనని విశేషాసక్తిగలవాడనై ప్రయత్నపడు చుండగా, **పరిశుద్ధులకు** ఒక్కసారే అప్పగింపబడిన బోధ నిమిత్తము మీరు పోరాడవలెనని మిమ్మును వేడుకొనుచు మీకు వ్రాయవలసివచ్చెను."

ప్రకటన 17:14 –"వీరు గొఱ్ఱెపిల్లతో యుద్ధము చేతురు గాని, గొఱ్ఱెపిల్ల ప్రభువులకు ప్రభువును రాజులకు రాజునైయున్నందునను, తనతోకూడ ఉండినవారు **పిలువబడినవారై, యేర్పరచబడినవారై, నమ్మకమైనవారై**

**యున్నందునను,** ఆయన ఆ రాజులను జయించును.”

అపో.కా. 11:26 –“వారు కలిసి యొక సంవత్సర మంతయు సంఘములో ఉండి బహుజనములకు వాక్యమును బోధించిరి. మొట్టమొదట అంతియొకయలో శిష్యులు **క్రైస్తవులనబడిరి**.”

అయితే ఈ **క్రైస్తవులు** అనే పదం అన్యజనులు పెట్టినపేరు. అన్యజనులకు మనము క్రైస్తవులము అనగా క్రీస్తును వెంబడించేవారం లేదా క్రీస్తు శిష్యులం.

## మనమే దేవుని మందిరం :



ఇక్కడ ఇంకో విషయాన్ని గమనించాలి, తెలుగులో 'సంఘం' అని ఉన్న చోట ఇంగ్లీషులో 'చర్చ్' *(Church)* అని తర్జుమా చేయబడింది. చర్చ్ అనగానే అందరి దృష్టంతా పరిశుద్ధులు కూడుకునే ఒక 'బిల్డింగ్' పైకి లేదా ఒక 'కట్టడం' పైకి వెళుతోంది. అది ఒక **'గుడి/మందిరం/ దేవాలయం'** లాగా అయిపోయింది. దేవుడు అక్కడ మాత్రమే ఉంటాడనే భావాన్ని, ఉద్దేశ్యాన్ని కలిగించారు. నిజానికి దేవుని మందిరం మనమే అన్న సంగతిని మరిచిపోయేంతగా 'చర్చ్' అనే పదం 'కట్టడాన్ని' చూపించడంలో తన ఆదిక్యతను ప్రదర్శించింది. చర్చ్ అంటే ఇటుకలతో కట్టిన గోడలో, బిల్డింగో కాదు. చర్చ్ అంటే మనమే. **మనమే దేవుని మందిరం, గోడలు లేని మందిరం.**

1కొరింథి 3:16,17 –“మీరు **దేవుని ఆలయమై** యున్నారనియు, దేవుని **ఆత్మ** మీలో నివసించు చున్నాడనియు మీరెరుగరా? ఎవడైనను దేవుని ఆలయమును పాడుచేసినయెడల దేవుడు వానిని పాడుచేయును. దేవుని ఆలయము పరిశుద్ధమై యున్నది; **మీరు ఆ ఆలయమై యున్నారు**.”

2కొరింథి 6:16 –“దేవుని ఆలయమునకు విగ్రహములతో ఏమిపొందిక? మనము జీవముగల దేవుని ఆలయమై యున్నాము; అందుకు దేవుడీలాగు సెలవిచ్చుచున్నాడు. –నేను వారిలో నివసించి సంచరింతును, నేను వారి దేవుడనై యుందును వారు నా ప్రజలైయుందురు. –కావున మీరు వారి మధ్యనుండి బయలువెడలి ప్రత్యేకముగా ఉండుడి; అపవిత్రమైన దానిని ముట్టకుడని ప్రభువు చెప్పుచున్నాడు. మరియు నేను మిమ్మును చేర్చుకొందును, మీకు తండ్రినై యుందును, మీరు నాకు కుమారులును కుమార్తెలునై యుందురని సర్వశక్తిగల ప్రభువు చెప్పుచున్నాడు.”

ఎఫెసీ 2:20-22 –“క్రీస్తుయేసే ముఖ్యమైన మూలరాయియై యుండగా అపొస్తలులును ప్రవక్తలును వేసిన పునాదిమీద మీరు కట్టబడియున్నారు. ప్రతి కట్టడమును ఆయనలో చక్కగా అమర్చబడి, ప్రభువునందు పరిశుద్ధమైన **దేవాలయ మగుటకు** వృద్ధిపొందుచున్నది. ఆయనలో మీరు కూడ **ఆత్మ** మూలముగా దేవునికి **నివాసస్థలమై** యుండుటకు కట్టబడుచున్నారు.”

1పేతురు 2:4-5 –“మనుష్యులచేత విసర్జింపబడినను, దేవునిదృష్టికి ఏర్పరచబడినదియు అమూల్యమును సజీవమునైన రాయియగు ప్రభువునొద్దకు వచ్చినవారై, యేసుక్రీస్తుద్వారా దేవునికి అనుకూలములగు ఆత్మసంబంధమైన బలులనర్పించుటకు పరిశుద్ధయాజకులుగా ఉండునట్లు, మీరును సజీవమైన రాళ్లవలెనుండి ఆత్మ సంబంధమైన **మందిరముగా** కట్టబడుచున్నారు.”

1తిమోతి 3:15 –“అయినను నేను ఆలస్యము చేసినయెడల **దేవుని మందిరములో, అనగా జీవముగల**

**దేవుని సంఘములో,** జను లేలాగు ప్రవర్తింపవలెనో అది నీకు తెలియవలెనని యీ సంగతులను నీకు వ్రాయుచున్నాను. ఆ సంఘము సత్యమునకు స్తంభమును ఆధారమునై యున్నది."



ఇప్పటికైనా మనం దేవుని మందిరమని, దేవుని **ఆత్మ** మనలో నివసిస్తాడని వాక్యానుసారంగా యెరిగి నమ్ముదాం, ఆ విధంగా ప్రవర్తిద్దాం!

## దేవుడు మనల్ని ఎలా పిలిచాడు?

దేవుడు సువార్త ద్వారా మనల్ని పిలిచాడని మనందరికి తెలిసిన విషయమే!

2థెస్స 2:14 –"మీరీలాగున రక్షింపబడి మన ప్రభువైన యేసు క్రీస్తు యొక్క మహిమను పొందవలెనని, ఆయన మా **సువార్త వలన** మిమ్మును పిలిచెను."

క్రీస్తు సంఘంలో ఎవరైనా చేరాలంటే మొదట సువార్తను అంగీకరించాలి. ఇదే లోకరీతిని చెప్పుకునే **'సంఘ సభ్యత్వం'**. సువార్తను అంగీకరించకుండా క్రీస్తు సంఘంలో సభ్యులం కాలేము. దేవుడు ఆకర్షించితేనే తప్ప మనం సువార్తను అంగీకరించలేము.

యోహాను 6:44 –"నన్ను పంపిన తండ్రి వానిని ఆకర్షించితేనే గాని యెవడును నా యొద్దకు రాలేడు అంత్యదినమున నేను వానిని లేపుదును."

అయితే మనమేదో మంచివారమనో, మన క్రియలు మంచివనో దేవుడు మనల్ని పిలువలేదు. కేవలం తన కృపనుబట్టి మాత్రమే మనల్ని పిలిచాడు.

2తిమోతి 1:9 –"మన **క్రియలనుబట్టి కాక తన స్వకీయ సంకల్పమునుబట్టియు,** అనాదికాలముననే క్రీస్తుయేసునందు మనకు అనుగ్రహింపబడినదియు, క్రీస్తు యేసను మన రక్షకుని ప్రత్యక్షతవలన బయలుపరచ బడినదియునైన తన **కృపనుబట్టియు,** మనలను రక్షించి **పరిశుద్ధమైన పిలుపుతో ఆయన మనలను పిలిచెను.** ఆ క్రీస్తుయేసు, మరణమును నిరర్థకము చేసి జీవమును అక్షయతను సువార్త వలన వెలుగులోనికి తెచ్చెను."

1కొరింథి 1:26-30 –"సహోదరులారా, మిమ్మును పిలిచిన పిలుపును చూడుడి. మీలో లోకరీతిని జ్ఞానులైనను, ఘనులైనను, గొప్ప వంశము వారైనను అనేకులు పిలువబడలేదు గాని **ఏ శరీరియు దేవుని యెదుట అతిశయింపకుండునట్లు,** జ్ఞానులను సిగ్గుపరచుటకు లోకములో నుండు **వెఱ్ఱివారిని** దేవుడు ఏర్పరచుకొని యున్నాడు. బలవంతులైనవారిని వ్యర్థము చేయుటకు లోకములో **నీచులైనవారిని, తృణీకరింపబడిన వారిని, ఎన్నికలేని వారిని దేవుడు ఏర్పరచుకొని యున్నాడు.** అయితే ఆయన మూలముగా మీరు క్రీస్తుయేసు నందున్నారు."

యోహాను 15:16 –"మీరు నన్ను ఏర్పరచుకొనలేదు; మీరు నా పేరట తండ్రిని ఏమి అడుగుదురో అది ఆయన మీకనుగ్రహించునట్లు మీరు వెళ్లి ఫలించుటకును, మీ ఫలము నిలిచియుండుటకును **నేను మిమ్మును ఏర్పరచుకొని** నియమించితిని."

## మనల్ని పిలవడంలో దేవుని ఉద్దేశ్యం ఏమిటి?

మనల్ని దేవుడు ఎందుకు/ఏ ఉద్దేశ్యముతో పిలిచాడో ఒకసారి చూద్దాం!

**1. క్రీస్తుతో సహవాసం చేయాలని :**

1కొరింథి 1:9 –"మన ప్రభువైన **యేసుక్రీస్తు** అను తన కుమారుని **సహవాసమునకు** మిమ్మును పిలిచిన దేవుడు నమ్మతగినవాడు."

మనల్ని పిలిచింది ప్రాముఖ్యంగా **ప్రభువైన యేసు క్రీస్తుతో సహవాసం చేయడానికి.** మొట్టమొదట మనం క్రీస్తుతో సహవాసం చేయడం ద్వారానే మన సహోదరులతో సహవాసం చేయగలం. అంటే మనలాగే క్రీస్తుతో సహవాసం చేయడానికి వచ్చిన వారితో సహవాసం చేయడమన్నమాట! దీన్నే క్రీస్తు కేంద్రీకృత సహవాసం అంటారు.

అయితే కొందరు ఇది పరలోకం వెళ్లాకనే నెరవేరుతుందని అంటారు. అయితే ఒక్కసారి ఈ క్రింది

వచనాలను చదవండి!

1కొరింథి 7:17–24: "అయితే ప్రభువు ప్రతివానికి ఏస్థితి నియమించెనో, దేవుడు ప్రతివానిని ఏస్థితియందు పిలిచెనో, ఆ స్థితియందే నడుచుకొనవలెను; ఈ ప్రకారమే సంఘములన్నిటిలో నియమించుచున్నాను. సున్నతి పొందినవాడెవడైనను పిలువబడెనా? అతడు సున్నతి పోగొట్టుకొనవలదు; సున్నతి పొందనివాడెవడైనను పిలువబడెనా? సున్నతి పొందవలదు. దేవుని ఆజ్ఞలను అనుసరించుటయే ముఖ్యము గాని సున్నతి పొందుటయందు ఏమియు లేదు, సున్నతి పొందక పోవుటయందు ఏమియులేదు. ప్రతివాడు ఏ స్థితిలో పిలువబడెనో ఆ స్థితిలోనే యుండవలెను. దాసుడవై యుండగా పిలువబడితివా? చింతపడవద్దు గాని స్వతంత్రుడవగుటకు శక్తి కలిగినయెడల, స్వతంత్రుడవగుట మరి మంచిది. ప్రభువునందు పిలువబడిన దాసుడు ప్రభువు వలన స్వాతంత్ర్యము పొందినవాడు. ఆ ప్రకారమే స్వతంత్రుడైయుండి పిలువబడినవాడు క్రీస్తు దాసుడు. మీరు విలువపెట్టి కొనబడినవారు గనుక మనుష్యులకు దాసులు కాకుడి. సహోదరులారా, ప్రతిమనుష్యుడును ఏస్థితిలో పిలువబడునో ఆ స్థితిలోనే **దేవునితో సహవాసము** కలిగి ఉండవలెను."

1యోహాను 1:3 –"మాతోకూడ మీకును సహవాసము కలుగునట్లు మేము చూచినదానిని వినినదానిని మీకును తెలియజేయుచున్నాము. మన సహవాసమైతే తండ్రితోకూడను ఆయన కుమారుడైన యేసుక్రీస్తుతో కూడను ఉన్నది."

యోహాను 15:4–6 –"నాయందు నిలిచియుండుడి, మీయందు నేనును నిలిచియుందును. తీగె ద్రాక్షావల్లిలో నిలిచి యుంటేనేగాని తనంతట తానే యేలాగు ఫలింపదో, ఆలాగే నాయందు నిలిచియుంటేనేకాని మీరును ఫలింపరు. ద్రాక్షావల్లిని నేను, తీగెలు మీరు. ఎవడు నాయందు నిలిచియుండునో నేను ఎవనియందు నిలిచి యుందునో వాడు బహుగా ఫలించును; నాకు వేరుగా ఉండి మీరేమియు చేయలేరు. ఎవడైనను నాయందు నిలిచియుండని యెడల వాడు తీగెవలె బయట పారవేయబడి యెండిపోవును; మనుష్యులు అట్టివాటిని పోగుచేసి అగ్నిలో పారవేతురు, అవి కాలిపోవును."

మనకు యేసుక్రీస్తుతో సహవాసం ఈ భూమి మీద ఉన్నప్పటి నుండే మొదలవుతుంది. ఆయన ఆరోహణమవుతూ 'ఆదరణకర్తను' అనగా 'పరిశుద్ధాత్మను' మనకు 'సంచకరువుగా' అనుగ్రహించి వెళ్లాడు. ఆయన 'ఇమ్మానుయేలు', యుగసమాప్తివరకు సదాకాలము మనకు తోడుగా ఉంటాడు. అందుకే మొట్టమొదట మనం యేసుక్రీస్తుతో సహవాసం కలిగియున్నామన్న సంగతి, కలిగియుండాలన్న సంగతి మరచిపోవద్దు. క్రీస్తుకు వేరుగా వుండి మనం ఫలించలేము. క్రీస్తు లేకుండా క్రిస్టియానిటీ లేదు, క్రీస్తు సంఘం లేదు.

**2. పరిశుద్ధులుగా ఉండాలని :**

1థెస్స 4:7 –"**పరిశుద్ధులగుటకే** దేవుడు మనలను పిలిచెనుగాని అపవిత్రులుగా ఉండుటకు పిలువలేదు."

1 థెస్స 4:3,4 –"మీరు **పరిశుద్ధులగుటయే,** అనగా మీరు జారత్వమునకు దూరముగా ఉండుటయే దేవుని చిత్తము. మీలో ప్రతివాడును, దేవుని ఎరుగని అన్యజనులవలె కామాభిలాషయందు కాక, పరిశుద్ధతయందును ఘనతయందును తన తన ఘటమును ఎట్లు కాపాడు కొనవలెనో అది యెరిగియుండుటయే దేవుని చిత్తము."

**3. స్వతంత్రులైనా దాసులై యుండాలని :**

గలతీ 5:13–15 –"సహోదరులారా, మీరు **స్వతంత్రులుగా ఉండుటకు** పిలువబడితిరి. అయితే ఒక మాట, ఆ స్వాతంత్యమును శారీరక్రియలకు హేతువు చేసికొనక, ప్రేమ కలిగినవారై యొకనికొకడు **దాసులైయుండుడి.** ధర్మశాస్త్ర మంతయు నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించుము అను ఒక్క మాటలో సంపూర్ణమైయున్నది. అయితే మీరు ఒకనినొకడు కరచుకొని భక్షించినయెడల మీరు ఒకనివలన ఒకడు బొత్తిగా నశించిపోదురేమో చూచుకొనుడి."

**4. వినయంతోను సాత్వికముతోను నడుచుకోవాలని :**

ఎఫెసీ 4:3,4 –"మీరు పిలువబడిన పిలుపునకు తగినట్లుగా **దీర్ఘశాంతముతో కూడిన సంపూర్ణ వినయముతోను సాత్వికముతోను నడుచుకొనవలెనని,** ప్రభువునుబట్టి ఖైదీనైన నేను మిమ్మును బతిమాలు కొనుచున్నాను. శరీర మొక్కటే, ఆత్మయు ఒక్కడే; ఆ

ప్రకారమే మీ పిలుపువిషయమై **యొక్కటే నిరీక్షణ యందుండుటకు** పిలువబడితిరి."

కొలొస్సీ 3:12 –"కాగా, దేవునిచేత ఏర్పరచబడినవారును పరిశుద్ధులును ప్రియులునైనవారికి తగినట్లు, మీరు జాలిగల మనస్సును, దయాళుత్వమును, వినయమును, సాత్వికమును, దీర్ఘశాంతమును ధరించుకొనుడి."

**5. కృతజ్ఞులై యుండాలని :**

కొలొస్సీ 3:15 –"క్రీస్తు అను గ్రహించు **సమాధానము మీ హృదయములలో ఏలుచుండ నియ్యుడి;** ఇందుకొరకే **మీరొక్క శరీరముగా** పిలువబడితిరి; మరియు **కృతజ్ఞులై యుండుడి.**"

1థెస్స 5:16 –"ప్రతి విషయమునందును **కృతజ్ఞతాస్తుతులు చెల్లించుడి.** ఈలాగు చేయుట యేసు క్రీస్తునందు మీ విషయములో దేవుని చిత్తము."

**6. మేలు చేసి బాధపడాలని :**

1పేతురు 2:20 –"తప్పిదమునకై దెబ్బలు తినినప్పుడు మీరు సహించినయెడల మీకేమి ఘనము? **మేలుచేసి బాధపడునప్పుడు మీరు సహించినయెడల** అది దేవునికి హితమగును; ఇందుకు మీరు పిలువబడితిరి."

**7. దూషించేవాళ్లను దీవించాలని :**

1పేతురు 3:9 –"**ఆశీర్వాదమునకు వారసులవుటకు** మీరు పిలువబడితిరి గనుక కీడుకు ప్రతికీడైనను దూషణకు ప్రతి దూషణయైనను చేయక **దీవించుడి.**"

పై వచనాలను బట్టి చూసినట్లయితే, మనం క్రీస్తుతో సహవాసం కలిగి పరిశుద్ధంగా జీవించాలని, మనం స్వతంత్రులమైనప్పటికీ ఒకరికొకరం దాసులైయుండాలని, సంపూర్ణ వినయముతోను, సాత్వికముతోను నడచుకోవాలని, ఒక్కటే నిరీక్షణయందుండాలని, మన హృదయాలలో సమాధానముండాలని, దేవునికి ఎల్లప్పుడు కృతజ్ఞతాస్తుతులు చెల్లించాలని, మేలుచేసి బాధపడాలని, కీడుకు ప్రతికీడు చేయకుండా దూషించేవాళ్లను దీవించాలని తెలియవస్తోంది. మరి మనం అలా వుంటున్నామో లేదో ఒకసారి మనల్ని మనం (పక్కవాళ్లను కాదు) పరీక్షించుకుందాం. ఎందుకంటే మార్పు అనేది మన నుండే మొదలుకావాలి.

## పరిశుద్ధుల సహవాసం-ప్రవర్తన :

పరిశుద్ధుల సహవాసంలో మన ప్రవర్తన ఎలా ఉండాలో ఒకసారి చూద్దాం;



**1. ఒకరినొకరు పురికొల్పుకోవాలి :**

హెబ్రీ 10:24,25 –"కొందరు మానుకొను చున్నట్లుగా, సమాజముగా కూడుట మానక, ఒకనినొకడు హెచ్చరించుచు, ఆ దినము సమీపించుట మీరు చూచిన కొలది మరి యెక్కువగా ఆలాగు చేయుచు, ప్రేమ చూపుటకును సత్కార్యములు చేయుటకును ఒకనినొకడు **పురికొల్పవలెనని (రేపవలెనని)** ఆలోచింతము."

పరిశుద్ధులు ఒకరినొకరు హెచ్చరించుకొనుచూ, ప్రేమ చూపుటకు, మంచి పనులు చేయుటకు ఒకనినొకడు ప్రోత్రహించుకోవడానికి మానకుండ సహవాసం చేయాలని, చివరి దినాల్లో మరి యెక్కువగా అంటే తరచుగా ఆవిధంగా చేయాలని సహవాసం యొక్క ఉద్దేశ్యము గురించి పై వచనంలో చెప్పబడింది. మరి మనం సహవాసం అలాగే చేస్తున్నామా? ఒకరినొకరం పురికొల్పుకుంటున్నామా? కనీసం మన పక్కన కూర్చున్న వారితోనైనా మాట్లాడుతున్నామా?

**2. ఒకనికొకడు లోబడి యుండాలి :**

ఎఫెసీ 5:19-21 –"ఒకనినొకడు కీర్తనలతోను సంగీతములతోను ఆత్మసంబంధమైన పాటలతోను హెచ్చరించుచు, మీ హృదయములలో ప్రభువునుగూర్చి పాడుచు కీర్తించుచు, మన ప్రభువైన యేసుక్రీస్తు పేరట

సమస్తమునుగూర్చి తండ్రియైన దేవునికి ఎల్లప్పుడును కృతజ్ఞతాస్తుతులు చెల్లించుచు, క్రీస్తునందలి భయముతో **ఒకనికొకడు లోబడియుండుడి."**

**3. ప్రేమగలవారై ఆతిథ్యము ఇవ్వాలి :**

1 పేతురు 4:8-9 -"ప్రేమ అనేక పాపములను కప్పును గనుక అన్నిటికంటె ముఖ్యముగా ఒకనియెడల ఒకడు **మిక్కటమైన ప్రేమగలవారై** యుండుడి. సణుగుకొనకుండ ఒకనికి ఒకడు **ఆతిథ్యము చేయుడి.**"

**4. ఉపచారము చేయాలి, బోధించాలి :**

1పేతురు 4:10-11 -"దేవుని నానావిధమైన కృపవిషయమై మంచి గృహ నిర్వాహకులైయుండి, ఒక్కొక్కడు కృపావరము పొందిన కొలది ఒకనికొకడు ఉపచారము చేయుడి. ఒకడు బోధించినయెడల దైవోక్తులను బోధించునట్టు బోధింపవలెను; ఒకడు ఉపచారము చేసినయెడల దేవుడు అను గ్రహించు సామర్థ్యమునొంది చేయవలెను. ఇందువలన దేవుడు అన్నిటిలోను యేసుక్రీస్తు ద్వారా మహిమపరచబడును. యుగయుగములు మహిమయు ప్రభావమును ఆయనకుండును గాక. ఆమేన్."

**5. ఒకనికొకడు బుద్ధి చెప్పుకోవాలి :**

హెబ్రీ 3:12-13 -"సహోదరులారా, జీవముగల దేవుని విడిచిపోవునట్టి విశ్వాసములేని దుష్టహృదయము మీలో ఎవనియందైనను ఒకవేళ ఉండునేమో అని జాగ్రత్తగా చూచుకొనుడి. నేడు మీరాయన శబ్దమును వినినయెడల, కోపము పుట్టించినప్పటివలె మీ హృదయములను కఠినపరచుకొనకుడని ఆయన చెప్పెను గనుక, పాపమువలన కలుగు భ్రమచేత మీలో ఎవడును కఠినపరచబడకుండునట్లు నేడు అనబడు సమయముండగానే, ప్రతిదినమును ఒకనికొకడు బుద్ధిచెప్పుకొనుడి. ఏలయనగా మొదటనుండి మనకున్న దృఢ విశ్వాసము అంతముమట్టుకు గట్టిగా చేపెట్టినయెడలనే క్రీస్తులో పాలివారమై యుందుము."

**6. క్రీస్తు వాక్యము సమృద్ధిగా నేర్చుకోవాలి :**

కొలస్సీ 3:16 -"సంగీతములతోను కీర్తనలతోను ఆత్మసంబంధమైన పద్యములతోను ఒకనికి ఒకడు బోధించుచు, బుద్ధిచెప్పుచు కృపా సహితముగా మీ హృదయములలో దేవునిగూర్చి గానముచేయుచు, సమస్తవిధములైన జ్ఞానముతో క్రీస్తు వాక్యము మీలో సమృద్ధిగా నివసింపనియ్యుడి."

**7. క్షేమాభివృద్ధి కలగనియ్యాలి :**

ఎఫెసీ 4:16 -"ఆయన శిరస్సయి యున్నాడు, ఆయననుండి సర్వశరీరము చక్కగా అమర్చబడి, తనలోనున్న ప్రతి అవయవము తన తన పరిమాణము చొప్పున పనిచేయుచుండగా ప్రతి కీలువలన గలిగిన బలముచేత అతుకబడి, ప్రేమయందు తనకు క్షేమాభివృద్ధి కలుగునట్లు శరీరమునకు అభివృద్ధి కలుగజేసి కొనుచున్నది."

1కొరింథీ 14:26 -"సహోదరులారా, యిప్పుడు మీలో ఏమి జరుగు చున్నది? మీరు కూడి వచ్చునప్పుడు ఒకడు ఒక కీర్తన పాడవలెనని యున్నాడు; మరియొకడు బోధింపవలెనని యున్నాడు; మరియొకడు తనకు బయలు పరచబడినది ప్రకటనచేయవలెనని యున్నాడు; మరియొకడు భాషతో మాటలాడవలెనని యున్నాడు; మరియొకడు అర్థము చెప్పవలెనని యున్నాడు. సరే; సమస్తమును క్షేమాభివృద్ధి కలుగుటకై జరుగనియ్యుడి."

**8(ఎ). అక్రమకారులకు బుద్ధి చెప్పువారిగా యుండాలి :**

**8(బి). ధైర్యము చెడినవారిని ధైర్యపరచేవారిగా ఉండాలి :**

**8(సి). దీర్ఘశాంతము గలవారై యుండాలి :**

1థెస్స 5:14 -"సహోదరులారా, మేము మీకు బోధించునది ఏమనగా అక్రమముగా నడుచుకొనువారికి బుద్ధిచెప్పుడి, ధైర్యము చెడినవారిని ధైర్యపరచుడి, బలహీనులకు ఊతనియ్యుడి, అందరియెడల దీర్ఘ శాంతముగలవారై యుండుడి."

**9. మర్యాదగాను క్రమముగాను జరగనియ్యాలి :**

1కొరింథీ 14:39 -"కాబట్టి నా సహోదరులారా, ప్రవచించుట ఆసక్తితో అపేక్షించుడి, భాషలతో మాటలాడుట ఆటంకపరచకుడి గాని, సమస్తమును మర్యాదగాను క్రమముగాను జరుగనియ్యుడి."

పై వచనాలను గమనించినట్లయితే, మనందరం సహవాసం చేస్తున్నపుడు ఒకరినొకరు హెచ్చరించు కోవాలని, ప్రేమ చూపుటకు, మంచి పనులు చేయుటకు ప్రోత్సహించుకోవాలని, ఒకరికొకరు లోబడియుండాలని,

ప్రేమగలవారమై ఆతిథ్యం ఇచ్చుకోవాలని, ఉపచారం చేయాలని, బోధించుకోవాలని, బుద్ధి చెప్పుకోవాలని, వాక్యాన్ని సమృద్ధిగా నేర్చుకోవాలని, పరిశుద్ధులకు క్షేమాభివృద్ధి కలిగేలా ప్రవర్తించాలని, అక్రమకారులకు బుద్ధి చెప్పాలని, ధైర్యము చెడిన వారిని ధైర్యపరచాలని, దీర్ఘశాంతము కలిగి బలహీనులకు సహాయం చేయాలని, ప్రతిదీ మర్యాదగాను, క్రమముగాను జరగనివ్వాలని వాక్యం సెలవిస్తోంది.

మరి మనం కూడుకున్నప్పుడు ఏం జరుగుతోంది? మన కూడిక వాక్యానుసారమేనా? ఒకసారి ఆలోచించండి! బైబిల్ క్రమము ఎక్కడ తప్పిపోతోంది? అక్రమకారులకు బుద్ధి చెప్పాల్సిన బాధ్యత కూడా మన మీద ఉందని మరచిపోవద్దు. నాకెందుకులే అని ఊరుకుంటే ఎక్కడ వేసిన గొంగళి అక్కడే అన్నట్లుగా ఉంటుంది. మనం బైబిల్ పక్షాన, ప్రభువు పక్షాన నిలబడదాం, బైబిల్ క్రమాన్ని పాటిద్దాం, దేవునికి మహిమకరంగా జీవిద్దాం!

## అన్యుల యెడల మన ప్రవర్తన :

కొలొస్సీ 4:5,6 –"సమయము పోనియ్యక సద్వినియోగము చేసికొనుచు, **సంఘమునకు వెలుపటివారి యెడల జ్ఞానము కలిగి నడుచుకొనుడి.** ప్రతి మనుష్యునికి ఏలాగు ప్రత్యుత్తరమియ్యవలెనో అది మీరు తెలిసికొనుటకై మీ సంభాషణ ఉప్పువేసినట్టు ఎల్లప్పుడు రుచిగలదిగాను కృపా సహితముగాను ఉండనియ్యుడి."

1థెస్స 4:12 –"సహోదరులారా, మీరు ప్రేమయందు మరియెక్కువగా అభివృద్ధినొందుచుండ వలెననియు, **సంఘమునకు వెలుపటివారి యెడల మర్యాదగా నడుచుకొనుచు,** మీకేమియు కొదువ లేకుండునట్లు మేము మీకు ఆజ్ఞాపించిన ప్రకారము మీరు పరుల జోలికి పోక, మీ సొంత కార్యములను జరుపుకొనుట యందును మీ చేతులతో పనిచేయుట యందును ఆశకలిగి యుండవలెననియు, మిమ్మును హెచ్చరించుచున్నాము."

## ఆదిమ క్రైస్తవులు ఎలా ఉండేవారు?

ఆదిమ క్రైస్తవులు ఎలా నడుచుకున్నారో ఒకసారి చూద్దాం!

అపో.కా. 2:42-47 –"వీరు అపొస్తలుల బోధయందును సహవాసమందును, రొట్టె విరుచుటయందును ప్రార్థన చేయుటయందును ఎడతెగక యుండిరి. అప్పుడు ప్రతివానికిని భయము కలిగెను. మరియు అనేక మహత్కార్యములును సూచకక్రియలును అపొస్తలుల ద్వారా జరిగెను. విశ్వసించినవారందరు ఏకముగా కూడి తమకు కలిగినదంతయు సమష్టిగా ఉంచుకొనిరి. ఇదియుగాక వారు తమ చరస్థిరాస్తులను అమ్మి, అందరికిని వారి వారి అక్కరకొలది పంచిపెట్టిరి. మరియు వారేకమనస్కులై ప్రతిదినము దేవాలయములో తప్పక కూడుకొనుచు ఇంటింట రొట్టె విరుచుచు, దేవుని స్తుతించుచు, ప్రజలందరివలన దయపొందినవారై, ఆనందముతోను నిష్కపటమైన హృదయముతోను ఆహారము పుచ్చుకొనుచుండిరి. మరియు ప్రభువు రక్షణ పొందుచున్నవారిని అనుదినము వారితో చేర్చుచుండెను."

అపో.కా. 4:29-35 –"ప్రభువా, ఈ సమయమునందు వారి బెదరింపులు చూచి, రోగులను స్వస్థపరచుటకును, నీ పరిశుద్ధ సేవకుడైన యేసు నామము ద్వారా సూచక క్రియలను మహత్కార్యములనుచేయుటకును నీ చెయ్యి చాచియుండగా, నీ దాసులు బహు ధైర్యముగా నీ వాక్యమును బోధించునట్లు అనుగ్రహించుము. వారు ప్రార్థనచేయగానే వారు కూడి యున్న చోటు కంపించెను; అప్పుడు వారందరు పరిశుద్ధాత్మతో నిండినవారై దేవుని వాక్యమును ధైర్యముగా బోధించిరి. విశ్వసించిన వారందరును ఏకహృదయమును ఏకాత్మయు గలవారై యుండిరి. ఎవడును తనకు కలిగిన వాటిలో ఏదియు తనదని అనుకొనలేదు; వారికి కలిగినదంతయు వారికి సమష్టిగా ఉండెను. ఇదియుగాక అపొస్తలులు బహుబలముగా ప్రభువైన యేసు పునరుత్థానమునుగూర్చి సాక్ష్యమిచ్చిరి. దైవకృప అందరియందు అధికముగా ఉండెను. భూములైనను ఇండ్లయినను కలిగినవారందరు వాటిని అమ్మి, అమ్మిన వాటి వెలతెచ్చి అపొస్తలుల పాదములయొద్ద పెట్టుచు వచ్చిరి. వారు ప్రతివానికి వానివాని అక్కరకొలది పంచిపెట్టిరి గనుక వారిలో ఎవనికిని కొదువలేకపోయెను."

అపో.కా. 5:1-16 –"అననీయ అను ఒక మనుష్యుడు తన భార్యయైన సప్పీరాతో ఏకమై

పొలమమ్మెను. భార్యయెరుకనే వాడు దాని వెలలో కొంత దాచుకొని కొంత తెచ్చి అపొస్తలుల పాదములయొద్ద పెట్టెను. అప్పుడు పేతురు అననీయా, నీ భూమి వెలలో కొంత దాచుకొని పరిశుద్ధాత్మను మోసపుచ్చుటకు సాతాను ఎందుకు నీ హృదయమును ప్రేరేపించెను? అది నీయొద్ద నున్నపుడు నీదే గదా? అమ్మిన పిమ్మట అది నీ వశమై యుండలేదా? యెందుకు ఈ సంగతి నీ హృదయములో ఉద్దేశించు కొన్నావు? నీవు మనుష్యులతో కాదు దేవునితోనే అబద్ధమాడితివని వానితో చెప్పెను. అననీయ యీ మాటలు వినుచునే పడి ప్రాణము విడువగా వినినవారికందరికిని మిగుల భయము కలిగెను; అప్పుడు పడుచు వారు లేచి వానిని బట్టతో చుట్టి మోసికొనిపోయి పాతిపెట్టిరి. ఇంచుమించు మూడు గంటల సేపటికి వానిభార్య జరిగినది యెరుగక లోపలికి వచ్చెను. అప్పుడు పేతురు –మీరు ఆ భూమిని ఇంతకే అమ్మితిరా నాతో చెప్పుమని ఆమెను అడిగెను. అందుకామె –అవును ఇంతకే అని చెప్పెను. అందుకు పేతురు –ప్రభువుయొక్క ఆత్మను శోధించుటకు మీరెందుకు ఏకీభవించితిరి? ఇదిగో నీ పెనిమిటిని పాతిపెట్టినవారి పాదములు వాకిటనే యున్నవి; వారు నిన్నును మోసికొని పోవుదురని ఆమెతో చెప్పెను. వెంటనే ఆమె అతని పాదములయొద్దపడి ప్రాణము విడిచెను. ఆ పడుచువారు, లోపలికి వచ్చి, ఆమె చనిపోయినది చూచి, ఆమెను మోసికొనిపోయి, ఆమె పెనిమిటియొద్ద పాతిపెట్టిరి. సంఘమంతటికిని, ఈ సంగతులు వినినవారికందరికిని మిగుల భయము కలిగెను. ప్రజలమధ్య అనేకమైన సూచకక్రియలును మహత్కార్యములును అపొస్తలులచేత చేయబడుచుండెను. మరియు వారందరు ఏకమనస్కులై సొలొమోను మంటపములో ఉండిరి. కడమవారిలో ఎవడును వారితో కలిసి కొనుటకు తెగింపలేదు గాని, ప్రజలు వారిని ఘనపరచుచుండిరి. పురుషులును స్త్రీలును అనేకులు మరియెక్కువగ విశ్వాసులై ప్రభువు పక్షమున చేర్చబడిరి. అందుచేత పేతురు వచ్చుచుండగా జనులు రోగులను వీధులలోనికి తెచ్చి, వారిలో ఎవనిమీదనైనను అతని నీడయైనను పడవలెనని మంచములమీదను పరుపులమీదను వారిని ఉంచిరి. మరియు యెరూషలేము చుట్టునుండు పట్టణముల జనులు రోగులను అపవిత్రాత్మలచేత పీడింపబడిన వారిని మోసికొని కూడివచ్చిరి. వారందరు స్వస్థత పొందిరి."

అపో.కా. 5:41,42 –"ఆ నామముకొరకు అవమానము పొందుటకు పాత్రులని యెంచబడినందున వారు సంతోషించుచు మహాసభ యెదుటనుండి వెళ్లిపోయి, ప్రతిదినము దేవాలయములోను ఇంటింటను మానక బోధించుచు, యేసే క్రీస్తని ప్రకటించుచుండిరి."

అపో.కా. 8:1-4 –"ఆ కాలమందు యెరూషలేములోని సంఘమునకు గొప్ప హింస కలిగినందున, అపొస్తలులు తప్ప అందరు యూదయ సమరయ దేశములయందు చెదరిపోయిరి. భక్తిగల మనుష్యులు స్తెఫనును సమాధిచేసి అతనిని గూర్చి బహుగా ప్రలాపించిరి. సౌలయితే ఇంటింట జొచ్చి, పురుషులను స్త్రీలను ఈడ్చుకొనిపోయి, చెరసాలలో వేయించి సంఘమును పాడుచేయుచుండెను. కాబట్టి చెదరిపోయినవారు సువార్త వాక్యమును ప్రకటించుచు సంచారముచేసిరి."

పై వచనాలను గమనించినట్లయితే, ఆదిమ క్రైస్తవులు అపోస్తలుల బోధయందును, సహవాసమందును, రొట్టె విరుచుటయందును, ప్రార్థన చేయుటయందును ఎడతెగక గడిపారట. ఏక హృదయము, ఏకాత్మయు కలిగియుండి, తమకు కలిగినదంతయు సమిష్టిగా ఉంచుకొన్నారు. తమ స్థిర చరాస్తులను అమ్మి అందరికి వారి వారి అక్కరకొలది పంచిపెట్టారు.

ప్రారంభ దినాల్లో ఉన్న వారే– ఎవడును తనకు కలిగియున్నది ఏదియు తనదని అనుకోలేదు. వారే అలా ఉంటే కడవరి దినాల్లో ఉన్న మనం ఇంకెలా ఉండాలి? డబ్బులు సంపాదించుకోవడానికి, వ్యాపారాలు చేయడానికి, ఆస్తులు కూడబెట్టుకోవడానికి ఇదేనా సమయం? సరే, మనకున్న అవసరాన్ని బట్టి, అవకాశాన్ని బట్టి మనం సంపాదిస్తున్నామే అనుకుందాం, మన సహోదరులలో ఎంత మందికి మనం సాయం చేస్తున్నాం? మనమంతా ఒక కుటుంబమని, ఎవరికి ఎలాంటి ఆపద వచ్చినా మేమున్నామనే భరోసానైనా ఇస్తున్నామా? సంఘంలో ఒకరు రేషన్ బియ్యం తింటుంటే, మరొకరు బిర్యానీలు తిని జల్సా చేస్తున్నారు. ఒకరు అద్దె ఇంట్లో ఉంటే, మరొకరు స్వంత బిల్డింగుల్లో, అపార్టుమెంట్లలో ఉంటున్నారు. ఒకరు అప్పుల్లో

కూరుకుపోయి బాధపడుతుంటే మరొకరు ఆస్తులు కూడబెట్టుకుంటున్నారు. ఒకరు సైకిల్‌పైన తిరుగుతుంటే మరొకరు బెంజ్ కార్లలో తిరుగుతున్నారు. కొందరైతే బీదవారి ముందు తమ **బలుపును** ప్రదర్శించడానికి ఏమాత్రం సంశయించడం లేదు. ఇదేనా ఒక్క కుటుంబంగా ఉండడమంటే? ఇదేనా ఒక్క శరీరంగా ఉండడమంటే? ఇదేనా దేవునికి మహిమకరంగా జీవించడమంటే? ఇదేనా సమిష్టిగా కలిగియుండడమంటే? సరే, సంఘం దాకా ఎందుకు కనీసం ఒకే కుటుంబానికి చెందిన అన్నదమ్ములు సమిష్టిగా కలిగియున్నారా? ఎవరికీ ఏ కొదువా లేకుండా ఉండగలుగుతున్నారా? లేదా ఎవరి సంపాదన వారిది అని సరిపెట్టుకుంటున్నారా?

మనలో చాలా మంది ఎవరైనా ఏదైనా సాయం అడిగితే తప్పించుకోవడానికి కొన్ని ట్రిక్కులు ప్లే చేస్తారు. బ్రదర్! ప్రార్థన చేద్దాం, దేవుడు సాయం చేస్తాడని, లేదా అసందర్భ వాక్యాన్ని చూపించి తృణీకరించడమో చేస్తారు. మన శక్తికి మించిన సాయం అడిగితే మనం ప్రార్థన చేద్దాం అనడంలో అర్థం ఉంది, కాని చాలా మంది తప్పించు కోవడానికి మాత్రమే ఎక్కువగా దీన్ని వాడుతుంటారు.

యాకోబు 2:15-16 -"సహోదరుడైనను సహోదరియైనను దిగంబరులై ఆ నాటికి భోజనము లేక యున్నప్పుడు. మీలో ఎవడైనను శరీరమునకు కావలసినవాటిని ఇయ్యక -సమాధానముగా వెళ్లుడి, చలి కాచుకొనుడి, తృప్తిపొందుడని చెప్పినయెడల ఏమి ప్రయోజనము?"

1యోహాను 3:16-17 -"ఆయన మన నిమిత్తము తన ప్రాణముపెట్టెను గనుక దీనివలన ప్రేమ యెట్టిదని తెలిసికొనుచున్నాము. మనము కూడ సహోదరుల నిమిత్తము మన ప్రాణములను పెట్ట బద్ధులమై యున్నాము. ఈ లోకపు జీవనోపాధిగలవాడైయుండి, తన సహోదరునికి లేమి కలుగుట చూచియు, అతనియెడల ఎంతమాత్రమును కనికరము చూపనివానియందు దేవుని ప్రేమ యేలాగు నిలుచును?"

ఇంత స్పష్టంగా మన ప్రాణాలను సైతం ఇవ్వడానికి సిద్దంగా ఉండాలని వాక్యం సెలవిస్తుండగా, మనం ప్రార్థన చేస్తే మాత్రం వాక్య విరుద్ధంగా దేవుడేమైనా బయలు పరుస్తాడా? కాకపోతే మన సాయం **'అపాత్రాదానం'** (వ్యర్థం) కాకుండా చూసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది, అందుకోసం మనం తప్పకుండా ప్రార్థనా పూర్వకంగా నడుచుకోవాలి. అంతేగాని దేవున్ని అడ్డం పెట్టుకొని తప్పించుకోవడానికి మాత్రం ప్రయత్నించవద్దు. మన హృదయాలోచనలు దేవునికి తెలుసు.

మనం దేనికి ప్రాధాన్యతనిస్తున్నామో మన క్రియలే తెలియజేస్తాయి. మనం వాక్యానికి ప్రాధాన్యతనిస్తే మన సహోదరుల గురించి అంటే సంఘ క్షేమం గురించి ఆలోచించి దేవునికి లోబడుతాం. డబ్బుకు ప్రాధాన్యత ఇస్తే లోభులమై తుచ్ఛమైన డబ్బుకు బానిసలమవుతాం. ఎవడునూ దేవునికిని సిరికిని దాసులుగా ఉండనేరరు.

మత్తయి 6:24 -"ఎవడును ఇద్దరు యజమానులకు దాసుడుగా నుండనేరడు; అతడు ఒకని ద్వేషించి యొకని ప్రేమించును; లేదా యొకని పక్షముగా నుండి యొకని తృణీకరించును. మీరు దేవునికిని సిరికిని దాసులుగా నుండనేరరు."

ఇంకా ముందుకు వెళ్తే, అననీయ సప్పీరాల ఉదంతం విన్నపుడు అక్కడ వున్నవారికి, విన్నవారికి భయం కలిగింది. అలాంటి సంఘటనలు మన మధ్య జరగకపోవడం వల్లనేమో మనకసలు భయమనేదే లేకుండా పోయింది. ఆ కాలంలో అపోస్తలుల ద్వారా సూచక క్రియలు, మహత్కార్యాలు, స్వస్థతలు జరిగించబడ్డాయి. ఆ తర్వాత స్తెఫను ఉదంతంతో అపోస్తలులు తప్ప అందరూ చెదిరిపోయారు. చెదిరిపోయిన వారు ఊరికే ఉన్నారా? సువార్తను ప్రకటించుచూ సంచారం చేశారు.

**వాళ్ల జీవనవిధానాన్ని మన జీవనవిధానంతో పోల్చుకుంటే, మనం కడుపులో చల్ల కదలకుండా, ఎవరితో ఏ సంబంధం లేకుండా, ఐక్యత లేకుండా, ఏ బాధ్యతా లేకుండా, ఏ బాదరబందీ లేకుండా, ప్రభువు త్వరగా రానైయున్నాడన్న స్పృహ ఏమాత్రం లేకుండా ఎంత సుఖంగా ఉన్నామో అనిపిస్తోంది.**

(సశేషం)

*(మిగతాది రాబోయే సంచికలలో తెలుసుకుందాం)*



# COVER STORY




## Western Wall (Wailing Wall) in Jerusalem

*Judaism's holiest place is the Western Wall in the Old City of Jerusalem. Part of the retaining wall erected by Herod the Great in 20 BC to support the vast plaza on which he rebuilt the Temple, it is venerated as the sole remnant of the Temple.*

*The wall and the plaza in front of it form a permanent place of worship, a site of pilgrimage for Jews and a focus of prayer — often petitions written down and placed between the huge stones. The Jewish name for the wall is the Kotel.*

*Orthodox Jewish men, fully bearded and garbed in black, bowing their heads as they read and pray from the Torah, are a common sight.*

*It is also the place where Jews down the ages have expressed their grief over the destruction of the Temple, their anguish giving the wall another name — the Wailing Wall.*

*But the wall is also a place for celebrations, especially of Bar and Bat Mitzvahs (coming-of-age ceremonies for Jewish sons and daughters).*

### Stones weigh up to eight tons

*In the exposed part of the Western Wall today, the seven lowest layers of stones are from Herod's construction. Most of these stones weigh between two and eight tons.*

*Above these are stones placed in later centuries, replacing those forced out when the Romans put down a Jewish revolt by sacking Jerusalem and destroying the Temple in AD 70.*

*The prayer area in front of the wall is divided into separate sections for men and women.*

*Men and married women who approach the wall are expected to have their heads covered. A kippah (skullcap) is provided free of charge. Cameras and electronic devices are forbidden on Saturdays.*

*To the right of the plaza, near the southern end of the Temple Mount, large stones jutting out of the wall are the remains of what is called Robinson's Arch. This arch once supported a grand staircase to the Temple.*

### Valley was filled in

*In the time of Christ a deep valley, spanned by bridges, ran beside the Western Wall and eight more levels of stones were visible. Through the centuries this valley, the Tyropoeon, has been progressively filled in with masonry and rubble.*

*Mark 13:1 recounts that one of Jesus' disciples exclaimed to him as they left the Temple: "Look, Teacher, what large stones and what large buildings!" Jesus replied: "Not one stone will be left here upon another; all will be thrown down."*

*The Western Wall was captured by Jordan during the 1948 Arab-Israeli War and recaptured by Israel during the 1967 Six-Day War.*

*Arab housing and mosques near the wall were immediately razed. In their place, today's plaza was created, stretching from the wall to the Jewish Quarter.*

*At the left end of the Western Wall is the entrance to a tunnel which allows visitors to walk along 500 metres of the extended wall, under buildings of the Old City. Sights include the biggest stone in the wall, estimated to weigh 570 tons.*

*Source : seetheholyland.net*




# మీకు తెలుసా

## యేసు ప్రభువు కోసం ముస్లింలు సిద్ధపరచిన సమాధి...

**యేసు ప్రభువు** కోసం ముస్లింలు సమాధి సిద్ధపరచడమేంటి? అని అనుకుంటున్నారా? అవును, ఆ సమాధి కూడా వారు వెంబడించే మహమ్మద్ ప్రవక్త సమాధి ప్రక్కనే ఏర్పాటు చేశారు.



**'గ్రీన్ డోమ్'** ప్రవక్త మసీదు అని పిలువబడే 'అల్-కుబ్బా అల్-ఖదరా' అనే మజీదు మదీనాలో మహమ్మద్ ప్రవక్త సమాధిపై నిర్మించబడింది. ఆ సమాధిపైన క్రీ.శ. 1279లో చెక్కతో ఒక డోమ్‌ను నిర్మించారు. క్రీ.శ.1481లో సంభవించిన అగ్ని ప్రమాదంలో డోమ్ పూర్తిగా కాలిపోయింది. భవిష్యత్తులో గోపురం కూలిపోకుండా ఉండడానికి అప్పటి సుల్తాన్ క్వైట్‌బే ఇటుకతో డోమ్‌ను పునర్నిర్మించాడు. ఆ తర్వాత క్రీ.శ.1837లో మొట్టమొదటిసారి డోమ్‌కు ఆకుపచ్చ రంగు వేయబడింది. అప్పటి నుండి ఆ డోమ్‌ను 'గ్రీన్ డోమ్'గా పిలుస్తున్నారు. ముస్లింలకు మక్కా తర్వాత అత్యంత పవిత్రమైనది ప్రవక్త సమాధి. ప్రవక్త భార్య ఆయేషా, ఆ సమాధిలో ప్రవక్తతో పాటు మొదటి ఖలీఫాలు అబూబకర్, ఉమర్‌ల సమాధులను ఏర్పాటు చేశారు. అయితే ప్రవక్త సమాధి ప్రక్కన 4వ స్థానం ఖాళీగా యేసు ప్రభువు కోసం వదిలివేయబడింది. వారి నమ్మకాల ప్రకారం క్రీస్తు చనిపోలేదని, దేవుడు పైకి తీసుకెళ్లాడని, తిరిగి రెండవసారి భూమిపైకి వస్తాడని, ఇస్లాం గురించి బోధిస్తాడని వారు నమ్ముతారు. రెండవసారి వచ్చినప్పుడు చనిపోయిన తర్వాత సమాధి చేయడానికి మహమ్మద్ ప్రవక్త సమాధి ప్రక్కన స్థానం కల్పించారు.

"అప్పుడు అల్లాహ్ ఇలా అన్నాడు : ఓ ఈసా నేను నిన్ను పూర్తిగా తీసుకుంటాను. నిన్ను నా వైపుకు లేపుకుంటాను. అవిశ్వాసుల బారి నుంచి నిన్ను పరిశుద్ధునిగా చేస్తాను. నిన్ను అనుసరించిన వారిని ప్రళయ దినం వరకూ అవిశ్వాసులపై పైచేయిగా ఉంచుతాను. ఆ తర్వాత మీరంతా మరలి రావలసింది నా వద్దకే. అప్పుడు నేనే మీ మధ్య ఉన్న పరస్పర విభేదాలపై తీర్పు చేస్తాను." (ఖురాన్ 3:55)

"ఇంకా-'మర్యమ్ పుత్రుడగు దైవప్రవక్త ఈసాను మేము హతమార్చాము' అని అనటం వల్ల వారు శిక్షను చవిచూశారు. నిజానికి వారు ఆయన్ని చంపనూ లేదు, శిలువపైకి ఎక్కించనూ లేదు. నిజం ఏమిటంటే, వారి కొరకు ఆయన్ని పోలిన వ్యక్తి రూపొందించబడ్డాడు. ఈసా విషయంలో విభేదించిన వారు ఆయన వ్యవహారంలో సందేహానికి లోనయ్యారు. అంచనాలను అనుసరించటం తప్ప వారికి ఈ విషయమై ఖచ్చితంగా ఏమీ తెలియదు. అసలు వారు ఆయన్ని చంపలేదు, పైగా అల్లాహ్ ఆయన్ని తన వైపునకు ఎత్తుకున్నాడు. అల్లాహ్ సర్వాధిక్యుడు, మహావివేకి." (ఖురాన్ 4:157,158)

పై ఆయతులకు విరుద్ధంగా ఉన్న ఈ క్రింది ఆయతును చూడండి;

"నేను పుట్టిన రోజూ, నేను చనిపోయే రోజూ, నేను సజీవినై తిరిగి లేపబడే రోజూ నాపై శాంతి కలుగుతుంది" (ఖురాన్ 9:33)

నిజానికి యేసు ప్రభువుకు సంబంధించిన సమాధి విషయంలో ప్రపంచ వ్యాప్తంగా చాలా కథలు వాడుకలో ఉన్నాయి. వాటి ప్రకారం మొత్తం 5 సమాధులు గుర్తించబడ్డాయి.

*(...మిగతా 26వ పేజీలో)*




అన్ని మతాలకు చెందినవారికి వారి మత సంబంధమైన పర్వదినాలు కొన్ని ఉంటాయి. యూదులకు కూడా ఏడు పండుగలు అత్యంత ప్రాముఖ్యమైనవి. వాటిని జరుపుకోవాలని దేవుడే ప్రత్యేకంగా చెప్పాడు. అందుకే వారి ప్రతి పండుగకు ఒక విశిష్టత ఉన్నది. అలాగే క్రైస్తవులకు కూడా ప్రాముఖ్యమైన పండుగలు రెండు ఉన్నాయి. ఒకటి ఈస్టర్, రెండోది క్రిస్మస్. కాని వీటిని జరుపుకోవాలని దేవుడు బైబిల్లో ఎక్కడా రాయించలేదు. అయితే ఈ రెండు పండుగలపై అన్యులకు మాత్రమే గాక కొందరు క్రైస్తవులకు కూడా ఎన్నో అభ్యంతరాలు ఉన్నాయి. కొందరు చేసుకోవద్దని, మరికొందరు చేసుకుంటే తప్పేంటని ... ఇలా వాదులాడుకునే వారు కూడా లేకపోలేదు. ఇలా భిన్నాభిప్రాయలు ఉండడానికి గల కారణము ఆ పండుగలపై సరియైన అవగాహన లేకపోవడమే! మన వాదులాటలు ఆసరాగా చేసుకొని అన్యులు కూడా ప్రశ్నిస్తున్నారు... క్రీస్తు డిసెంబర్ 25న పుట్టాడని బైబిల్లో నుండి గాని, చారిత్రక ఆధారాలతో గాని నిరూపిస్తే లక్ష రూపాయలు బహుమతిగా ఇస్తామని ప్రకటనలు కూడా గుప్పిస్తున్నారు. మరి ఇంత వరకు మనలో ఎవరూ కూడా అలా నిరూపించే ప్రయత్నం చేయలేదు. ఎందుకని? అంటే మనం అబద్ధాన్ని వెంబడిస్తున్నామా?

అందుకే ఒకసారి క్రిస్మస్, ఈస్టర్‌ల గురించి బైబిల్‌లో నుండి మరియు చారిత్రాత్మకంగా పరిశోధన చేసి తెలుసుకునే ప్రయ్నతం చేద్దాం!

## ఈస్టర్ పండుగ

ఈస్టర్ అంటే యేసు ప్రభువు పునరుత్థానాన్ని జ్ఞాపకం చేసుకోవడానికి క్రైస్తవులు మార్చి-ఏప్రిల్ మధ్యలో జరుపుకునే ఒక పండుగ. మొట్టమొదట క్రీ.శ. 2వ శతాబ్దంలో ఈస్టర్ పండుగను క్రైస్తవ సంఘం జరుపుకున్నట్లు తెలుస్తోంది (పస్కా పేరుతో, ఈస్టర్ పేరుతో మాత్రం కాదు). నిజానికి ప్రతి సంవత్సరం పస్కాను ఆచరించే అలవాటు ఉన్న యూదు క్రైస్తవులు, పస్కా పండుగ దినాల్లో యేసు ప్రభువు మరణ-పునరుత్థానాలను జ్ఞాపకం చేసుకునేవారు. నిజానికి పాతనిబంధనలో యూదులకు చెప్పినట్లుగా క్రీస్తు సంఘానికి పండుగలను జరుపుకోవాలని ప్రత్యేకంగా చెప్పక పోయినప్పటికీ, బహుశా అపోస్తలుడైన పౌలు కొరింథీయులకు రాసిన పత్రికలో చెప్పిన మాటలు వారిని ప్రభావితం చేసియుండవచ్చును.

1కొరింథి 5:7-8: "మీరు పులిపిండి లేనివారు గనుక క్రొత్త ముద్ద అవుటకై ఆ పాతదైన పులిపిండిని తీసిపారవేయుడి. ఇంతే కాక క్రీస్తు అను మన పస్కా పశువు వధింప బడెను, గనుక పాతదైన పులిపిండితోనైనను దుర్మార్గతయు దుష్టత్వమునను పులిపిండితోనైనను కాకుండ, నిష్కాపట్యమును సత్యమునను పులియని రొట్టెతో పండుగ ఆచరింతము."

ఆ క్రైస్తవ పస్కాయే ఆ తర్వాత వివిధ ఆచారాలతో కూడిన **'ఈస్టర్'** పండుగలా రూపాంతరం చెందింది.

5వ శతాబ్దానికి చెందిన సోక్రటీస్ *(Socrates of Constantinople also known as Socrates Scholasticus)* అనే క్రైస్తవ చరిత్రకారుడు యేసు క్రీస్తు మరణ-

పునరుత్థానాలను ప్రపంచ వ్యాప్తంగా జరుపుకోవాలని పట్టుబట్టాడు. ఇతడు క్రీ.శ.305 నుండి క్రీ.శ.439 మధ్య కాలంలో జరిగిన క్రైస్తవ సంఘ చరిత్ర గురించి 'హిస్టోరియా ఎక్లేసియాస్టికా *(Historia Ecclesiastica)* అనే గ్రంథాన్ని రచించాడు.

## ఈస్టర్ అనే పేరు ఎలా వచ్చింది?

కింగ్ జేమ్స్ వెర్షన్‌లో అపో.కా. 12:4వ వచనంలో యూదుల 'పస్కా'ను ఆంగ్లంలో **'ఈస్టర్'** అని అసంబద్ధంగా అనువదించడం జరిగింది. నిజానికి ఈస్టర్ అనే పదం పస్కా పండుగను సూచించే పదం కానే కాదు.

నిజానికి ఈస్టర్ యొక్క మూల పదాలను చూసినట్లయితే, తూర్పుకు చెందిన అనే అర్థాన్ని సూచిస్తాయి. మరి తూర్పుకు, యేసు క్రీస్తు పునరుత్థానానికి ఏంటి సంబంధం?

జర్మనీకి చెందిన గాడెస్ ఆఫ్ 'ఈస్ట్' అనే అన్యమత దేవతను ఈస్ట్రే *(Eostre, or Eostrae)* అని పిలిచేవారని, ఆ దేవత సంతానాన్ని అనుగ్రహిస్తుందని, సంతానోత్పత్తికి చిహ్నంగా కుందేలును, గుడ్లను ఉపయోగించేవారని, ఆ అన్యమత దేవత పేరు నుండి 'ఈస్టర్' అనే పేరు వచ్చిందని ఒక సిద్ధాంతం చెబుతోంది.




ఇంకో సిద్ధాంతం ప్రకారం, బాబిలోనియన్‌కు చెందిన 'ఇష్టార్' దేవత *(Ishtar : goddess of love, war and sex)* పేరు నుండి 'ఈస్టర్' వచ్చిందని అంటారు.

అయితే ఈస్టర్ పదం యొక్క వ్యుత్పత్తి గురించి క్రీ.శ.725లో బేడె *(Northumbrian monk Bede)* రాసిన 'ది రికానింగ్ ఆఫ్ టైమ్' *(The Reckoning of Time)* అనే పుస్తకంలో వివరించబడింది. యూరప్‌లోని ఆంగ్లో శాక్సన్స్ 'వసంతం మరియు సంతానోత్పత్తి' దేవతయైన ఈస్ట్రే *(Eostre, or Eostrae)*ను ఘనపరచడానికి ఒక పండుగను వసంత విషువత్తు కాలంలో జరుపుకునేవారు. ఆ అన్యమత దేవత పేరు నుండే 'ఈస్టర్' అనే పేరు వచ్చిందని తెలియపరచాడు.

వాస్తవానికి, ప్రభువు పునరుత్థాన దినానికి ఈస్టర్ అనే పేరు ఎలా వచ్చిందో, ఎప్పటి నుండి వచ్చిందో తెలియపరిచే స్పష్టమైన ఆధారాలు ఏవీ లేవు. అయినప్పటికీ 'ఈస్టర్' అనే పదం బిబ్లికల్ పదం మాత్రం కాదు. అంతేగాకుండా ఈస్టర్ అనే పదం పస్కాను గాని, పునరుత్థానాన్ని గాని సూచించే పదం అసలే కాదు.

## ఈస్టర్‌ను ఎప్పుడు జరుపుకుంటారు?

ప్రారంభ శతాబ్దాలలో యూదు క్రైస్తవులు యూదుల పస్కా పండుగ దినాలలో ప్రభువు మరణ– పునరుత్థానాలను జ్ఞాపకం చేసుకునేవారు. ఆ తర్వాత రోజులలో ప్రభువు ఆదివారం పునరుత్థానుడైనందున పునరుత్థాన దినాన్ని ఆదివారం రోజున అంటే పస్కా పండుగ తర్వాత వచ్చే ఆదివారం రోజున ఆచరించేవారు. అంటే ప్రతి సంవత్సరం ఈ పండుగ ఒకే తేదీన రాదు. వసంత విషువత్తు తర్వాత వచ్చే పౌర్ణమి తర్వాతి ఆదివారం రోజున యేసు క్రీస్తు పునరుత్థాన పండుగను జరుపుకోవాలని నిర్ణయించడమైనది. ఆ కాలంలో జూలియన్ కేలండర్ ప్రకారం వసంత విషువత్తు మార్చి 25న అవుతుంది. అంటే మార్చి 25 తర్వాత వచ్చే పౌర్ణమి వెళ్లిపోయాక వచ్చే మొదటి ఆదివారం పునరుత్థాన ఆదివారం (ఈస్టర్ సండే) అవుతుందన్న మాట!

రోమన్ చక్రవర్తి అయిన కాన్‌స్టాంటైన్ క్రీ.శ.313లో క్రైస్తవునిగా మారాడు. ఆ తర్వాత క్రీ.శ.325లో (జూన్, 19) నైసియాలో ఒక క్రైస్తవ సభను ఏర్పాటు చేయడం జరిగింది. ఈ క్రిస్టియన్ కౌన్సిల్‌లో వసంత విషువత్తు తరువాత వచ్చే పూర్ణిమ తర్వాత వచ్చే మొదటి ఆదివారంనాడు **'ఈస్టర్'** అని నిర్ణయం చేశారు. అలాగే వసంత విషువత్తు మార్చి21న వుండాలి అని కూడా సమావేశంలో నిర్ణయమైంది. ఎందుకంటే ఆ సంవత్సరంలో వసంత విషువత్తు మార్చి 21న వచ్చింది కాబట్టి, ఇక మీదట వసంత

*Source : theguardian / wikipedia*

విషువత్తు ఎప్పుడూ మార్చి21న వచ్చేలా ఉండాలని నిర్ణయించారు.

ఇలా ఒక నియమిత తేదీ లేకపోయినందున ఈ పండుగను ఎప్పుడు ఆచరించాలో చాలా మందికి తెలిసేది కాదు. అందుకోసం భవిష్యత్తు సంవత్సరాలలో వచ్చే పండుగల తేదీలను సూచిస్తూ 'పాస్చల్ పట్టిక' *(Paschal table)*ను తయారు చేసుకున్నారు. మొట్ట మొదట థియోఫిలస్ *(Theophilus' Paschal table)* పాస్చల్ టేబుల్‌ను క్రీ.శ.390 ప్రాంతంలో రూపొందించాడు. అయినప్పటికీ అది అంతగా వినియోగంలోకి రాలేదు. ఆ తర్వాత అలెగ్జాండ్రియాకు చెందిన సిరిల్ *(Patriarch Cyril of Alexandria)* క్రీ.శ.430 ప్రాంతంలో క్రీ.శ.437–531 వరకు భవిష్యత్తు తేదీలను నిర్ణయిస్తూ 'పాస్చల్ పట్టిక' *(Paschal table)* తయారు చేశాడు.

ఆ తర్వాత వాటికి కొనసాగింపుగా 'డయనోషియస్ ఎక్సిగ్యువస్' *(Dionysius Exiguus : 475-544 AD)* అనే రోమన్ సన్యాసి క్రీ.శ.525లో ఈస్టర్ తేదీలు గల 'ఈస్టర్ పట్టిక' *(Easter Table)*ను తయారు చేశాడు. క్రీ.శ.532 నుండి 626 వరకు 95 సంవత్సరాల భవిష్యత్తు తేదీలతో ఈస్టర్ టేబుల్‌ను రూపొందించాడు. ఇతన్నే **'డెన్నిస్ ది లిటిల్'** అని లేదా 'డెన్నిస్ ది హంబుల్' అని పిలిచేవారు. ఇతని ఈస్టర్ టేబుల్‌ను ఒక శతాబ్దం తర్వాత రోమన్ సంఘం అంగీకరించి వినియోగంలోకి తీసుకొచ్చింది.

ఇక్కడ ఒక విషయాన్ని గమనించాలి! థియోఫిలస్ కాలంలోనూ, సిరిల్ కాలంలోనూ ఈస్టర్ టేబుల్ అని కాకుండా పాస్చల్ టేబుల్ (పస్కా టేబుల్) అని పిలిచేవారు. ఆ తర్వాత డెన్నిస్ ది లిటిల్ కాలం వరకు వచ్చే సరికి ఈస్టర్ టేబుల్ అని పిలవడం జరిగింది. అంటే ఈ మధ్య కాలంలోనే పాస్చల్ టేబుల్ కాస్తా ఈస్టర్ టేబుల్‌గా మారిపోయిందన్న మాట! అంటే ఈ మధ్య కాలంలోనే **'ఈస్టర్'** అనే పదాన్ని ఉపయోగించడం ప్రారంభించారని అర్థమౌతోంది.

ఆ తర్వాత క్రీ.శ.616లో ఒక అజ్ఞాత పండితుడు డెన్నిస్ ది లిటిల్ ఈస్టర్ టేబుల్‌ను కొనసాగిస్తూ క్రీ.శ.721 వరకు భవిష్యత్తు తేదీలను నిర్ణయించి ప్రచురించాడు.

క్రీ.శ.725లో బేడె *(Latin name:Beda Venerabilis)* డెన్నిస్ ఈస్టర్ పట్టికకు కొనసాగింపుగా ఒక గొప్ప ఈస్టర్ చక్రాన్ని ప్రచురించాడు. బేడె యొక్క ఈస్టర్ చక్రంలో చంద్ర చక్రాలు *(lunar cycles of 19 years)*, సూర్య చక్రాలు *(solar cycles of 28 years)* ఉంటాయి. అలా 532 సంవత్సరాలు గల గొప్ప ఈస్టర్ చక్రాన్ని రూపొందించాడు. ఇతని ఈస్టర్ చక్రాన్ని రోమ్ సంఘం మాత్రమే కాకుండా ప్రపంచ వ్యాప్తంగా అన్ని సంఘాలు ఉపయోగించుకున్నాయి.

ఆ తర్వాత ఈస్టర్ తేదీని సులభతరం చేయడం కోసం అనేక ప్రయత్నాలు జరిగాయి. క్రీ.శ.1928లో యునైటెడ్ కింగ్‌డమ్‌లో ఈస్టర్ చట్టం చేయబడింది. దాని ప్రకారం ఏప్రిల్‌లో రెండవ శనివారం తర్వాత వచ్చే ఆదివారం ఈస్టర్‌గా గుర్తించాలని చట్టం చేయడం జరిగింది. కాని ఈ చట్టం అమలు చేయబడలేదు.

అలాగే 1997లో సిరియాలోని అలెప్పోలో జరిగిన సమ్మిట్‌లో, వరల్డ్ కౌన్సిల్ ఆఫ్ చర్చెస్ *(WCC)* ఈస్టర్ గణనలో ఒక సంస్కరణను ప్రతిపాదించింది. కాని ఇది కూడా ఆమోదించ బడలేదు.

ఆ తర్వాత జనవరి 2016 లో, క్రైస్తవ చర్చిలు ఈస్టర్ కోసం సాధారణ, సార్వత్రిక తేదీని అంగీకరించాలని భావించాయి. ఇందులో ఏప్రిల్‌లో రెండవ లేదా మూడవ ఆదివారం ప్రజాదరణ పొందిన ఎంపికలు. ఇది ఇంకా పరిశీలన దశలోనే ఉన్నది.

## ఈస్టర్‌ను ఎలా జరుపుకుంటారు?

చాలా దేశాలలో ఈస్టర్ అనేది లెంట్ దినాలతో ప్రారంభమౌతుంది. అంటే ఈస్టర్ కంటే 40 రోజుల ముందు (ఆదివారాలను వదిలేయాలి) భస్మ బుధవారంతో ప్రారంభమౌతుంది. 'లెంట్' అనేది పాత ఆంగ్ల పదము లెంక్టెన్ *(lencten)*కు సంక్షిప్త రూపం. ఈ పదానికి 'వసంత కాలం' *(spring season)* అని అర్థం. క్రీ.శ.339లో అథనేషియస్ *(Saint Athanasius)* ప్రపంచమంతటా చాలా ఏళ్ల నుండి పాస్చా (ఈస్టర్)లో ఉపవాస దినాలు ఆచరించబడుతున్నాయి అని రాసాడు. నిజానికి క్రీ.శ.325లో జరిగిన నైసియా కౌన్సిల్‌లో ఆ ఉపవాస దినాలకు 'లెంట్ ఉపవాస దినాలు'గా నామకరణం చేశారు. సుమారు క్రీ.శ.2వ శతాబ్దంలో

రాయబడిన **'డిడకే'** *(Didache)* గ్రంథంలో బాప్తిస్మము తీసుకోవడానికి ముందు ఉపవాసం ఉండాలని సూచించబడింది. అందువలన కొన్ని సంవత్సరాలుగా ఈస్టర్ రోజున బాప్తిస్మములు ఇవ్వబడుతున్నందున లెంట్ ఉపవాస దినాలను ఈస్టర్ ముందు జతచేయడం జరిగింది. క్రీ.శ.363-364లో జరిగిన లవదొకియా కౌన్సిల్ *(Council of Laodicea)*లో కూడా లెంట్ ఉపవాస దినాల ఆవశ్యకతను పునరుద్ఘాటించారు.

ఈ నలభై రోజులు కొందరు మాంసం తినడం మానేస్తారు. మరికొందరు ఉపవాసాలు ఉంటారు. ఈ దినాలలో పెళ్లిండ్లు, శుభకార్యాలు జరుపుకోరు. కొన్ని దేశాలలో లైంగిక సంబంధాలకు కూడా దూరంగా ఉంటారు. మరికొన్ని దేశాలలో భస్మ బుధవారానికి ముందు రోజున మంగళవారం నాడు, లెంట్ దినాలలో తినకూడని పధార్థాలతో విందులు చేసుకుంటారు. అయితే ఈ ఉపవాస దినాలు ఒక్కో దేశంలో ఒక్కో విధంగా జరుపుకుంటారు. కొన్ని దేశాలలో 55 రోజులు జరుపుకుంటే, మరికొన్ని దేశాలలో ఆదివారాలను వదిలివేయకుండా ఈస్టర్ ముందు 40వ రోజు నుండి జరుపుకుంటారు.

ఈస్టర్ ఆదివారానికి ముందు ఆదివారం రోజున మట్టల ఆదివారం *(Palm Sunday)* అని జరుపుకుంటారు. **ఇది యేసుప్రభువు సిలువ వేయబడడానికి ముందు వారం యెరుషలేములో ప్రవేశించిన రోజు.** ఆ రోజు అందరూ మట్టలను చేతబట్టుకొని హోసన్నా... హోసన్నా... అంటూ అరుస్తూ క్రీస్తును ఘనపరుస్తారు.

తర్వాత ఈస్టర్ ఆదివారానికి ముందు వచ్చే శుక్రవారాన్ని **శుభశుక్రవారంగా** సెలబ్రేట్ చేసుకుంటారు. **ఈ రోజు యేసుప్రభువు సిలువ వేయబడిన రోజు.** ఈ రోజున కొందరు ఉపవాసం ఉండి ప్రభువును సిలువ వేసినందుకు దు:ఖిస్తూ జరుపుకుంటారు. మరికొందరు లోకరక్షణ కోసం సిలువనెక్కినందుకు ఆనందంగా ప్రార్థనలు చేస్తూ జరుపుకుంటారు. చాలా సంఘాలలో యేసు ప్రభువు చెప్పిన చివరి ఏడు మాటలను జ్ఞాపకం చేసుకుంటారు. కొన్ని సంఘాలలో ఆ రోజు **'మూడు గంటల వేదన'** పేరుతో మధ్యాహ్నం 12 గంటల నుండి 3 గంటల వరకు ప్రార్థనలో గడుపుతారు.




ఈస్టర్ ఆదివారం రోజున అందరూ ఉదయాన్నే రెడీ అయిపోయి చర్చికి హాజరవుతారు. **ఈ ఆదివారం యేసు ప్రభువు మరణాన్ని జయించి సమాధి నుండి తిరిగి లేచిన రోజు.** ప్రభువు సమాధి గెలిచాడని, పునరుత్థానుడయ్యాడని ఒకరికొకరు చెప్పుకుంటూ సంబరాలు జరుపుకుంటారు.

అయితే ఈ పండుగ అన్ని దేశాలలో ఒకే విధంగా జరగదు. చాలా దేశాల్లో ఈస్టర్ ఎగ్స్, ఈస్టర్ బన్నీ, ఈస్టర్ క్యాండీ, చాక్లెట్స్, విందు, వినోదాలతో ముడిపడి ఉంటుంది.

అమెరికా, ఆస్ట్రేలియా దేశాలలో ఈస్టర్ పండుగలో భాగంగా ఈస్టర్ గుడ్ల వేటలో, ఈస్టర్ బన్నీ నుండి ఈస్టర్ క్యాండీలను సేకరించడంలో పిల్లలందరూ ఉత్సాహంగా పాల్గొంటారు. తల నుండి కాలి వరకు పాస్టెల్స్ ధరిస్తారు.

మన దగ్గర భోగి మంటల్లాగా, జర్మనీలో ఈస్టర్ ఫైర్‌ను ఏర్పాటు చేస్తారు. శీతాకాలం ముగిసి వసంతం రాబోతోందనడానికి గుర్తుగా క్రిస్మస్ చెట్లను కాలుస్తారు. జర్మన్లు ఈస్టర్‌ను 'ఫ్యామిలీడే' అని పిలుచుకుంటారు. గొర్రెపిల్ల ఆకారంలో ఉండే కేక్‌తో సహా చాలా రకాల తీపి వంటకాలను చేసుకుంటారు. గుడ్లు మరియు కుకీలు తమ తోటలో దాచిపెట్టి వాటిని వెతకడంలో గడుపుతారు. జర్మనీలో 'ఎగ్ ట్రీ' బాగా ప్రజాదరణ పొందింది.

గ్రీసులో చర్చిలు అలంకరించబడతాయి. ఊరేగింపులు జరుగుతాయి. క్రీస్తు రక్తాన్ని సూచించడానికి గుడ్లకు ఎర్రని రంగులు వేస్తారు. ఒకరినొకరు కలుసుకున్నపుడు గుడ్లను పగలగొట్టి *Christos anesti!* (క్రీస్తు లేచాడు) అని చెప్తుతారు. గుడ్లు పగలగొట్టడాన్ని యేసు క్రీస్తు సమాధి నుండి బయటికి

రావడానికి ప్రతీకగా భావిస్తారు.

హంగేరీలో ఈస్టర్ సెలబ్రేషన్స్‌లో భాగంగా *'Watering of the Girls' or 'Dousing Day'*ను జరుపుకుంటారు. సాంప్రదాయ వస్త్రాలు ధరించి అబ్బాయిలందరూ అమ్మాయిల మీద నీళ్ల బకెట్లు కుమ్మరిస్తారు (మన దగ్గర 'హోలి' రోజున రంగు నీళ్లు చల్లుకున్నట్లుగా). ఆ తర్వాత అమ్మాయిలు అబ్బాయిలకు బహుమతులు అందజేస్తారు.

పైన చెప్పిన విషయాలను బట్టి మీకు ఈ పాటికే అర్థమైయుంటుంది, ఈస్టర్ ఆచారాలకు బైబిల్‌కు ఎలాంటి సంబంధం లేదని.

## క్రిస్మస్ పండుగ

క్రిస్మస్ అనేది డిసెంబర్ 25న క్రీస్తు పుట్టిన రోజుగా భావించి క్రైస్తవులందరూ పండుగ జరుపుకుంటారు. క్రిస్మస్ అనేది క్రైస్ట్ + మాస్‌లకు సంక్షిప్త రూపం, అంటే క్రీస్తును ఆరాధించడం అనేది దాని యొక్క అర్థం. క్రీస్తు పుట్టిన రోజుకు సంబంధించి బైబిల్‌లో సరియైన ఆధారాలు లేవు. పరోక్షంగా కొన్ని ఆధారాలను బట్టి ఇదమిద్ధంగా యేసు ప్రభువు ఏ కాలంలో పుట్టి ఉండవచ్చునో కనుక్కోవచ్చు అంతే! అయితే మొదట ఒకసారి చారిత్రక ఆధారాలను పరిశీలిద్దాం. ఆ తర్వాత బైబిల్లోని పరోక్ష ఆధారాలను విశ్లేషించుకుందాం.

### క్రిస్మస్ యొక్క చారిత్రక ఆధారాలు :

మొట్టమొదటి సారిగా క్రీ.శ.336లో డిసెంబర్ 25న క్రిస్మస్ జరుపుకున్నట్లు రికార్డు అయ్యింది. అసలు క్రీస్తు పుట్టుకకు సంబంధించిన వివరాలను మొట్ట మొదట క్రైస్తవ పండితుడు, చరిత్రకారుడు అయిన 'సెక్టస్ జూలియస్ ఆఫ్రికానస్' *(Sextus Julius Africanus c.160–c.240)* నమోదు చేసే ప్రయత్నం చేశాడు. (ఇదే కాలంలో హిప్పోలిటస్ *(Hippolytus of Rome c. 170 – c. 235 AD)* తన పుస్తకంలో క్రీస్తు మార్చి 25న గర్భంలో ప్రవేశించినట్లు, డిసెంబర్ 25న జన్మించినట్లు రాసాడు. కాని అది అంతగా ప్రాచుర్యం పొందలేదు.) క్రీ.శ.221లో ఆఫ్రికానస్ ఐదు సంపుటాలు గల **'క్రానోగ్రాఫియై'** *(Chronographiai)*ను రచించాడు. ఇందులో సృష్టి నుండి క్రీస్తు వరకు 5500 సంవత్సరాలుగా గుర్తించి రాశాడు. 5501 యొక్క మొదటి రోజున క్రీస్తు అవతార దినాన్ని (అంటే స్త్రీ గర్భంలోకి ప్రవేశించిన రోజు) పొందుపరిచాడు. అంటే ప్రస్తుత కాలమానం ప్రకారం క్రీ.పూ.1, మార్చి 25వ తేది అవుతుంది. అంటే క్రీస్తు 9 నెలల తర్వాత క్రీ.పూ.1, డిసెంబర్ 25న జన్మిస్తాడన్నమాట. ఇది క్రానోగ్రఫియే ప్రకారం 5501 సెప్టెంబర్ 25 అవుతుంది.

తప్పుడు గణనలతో, పొరపాట్లతో రూపొందించబడిన 'క్రానోగ్రాఫియై' అమలుకు నోచుకోక పోయినా, ఆ తర్వాత చాలా సృష్టి శకాలను తయారుచేయడానికి ఆధారమైంది.

అతని తర్వాత 'డయనోషియస్ ఎక్సిగ్యువస్' *(Dionysius Exiguus @ Dennis the Little)* అనే రోమన్ సన్యాసి క్రీ.శ.525లో భవిష్యత్తు ఈస్టర్ తేదీలు గల 'ఈస్టర్ టేబుల్'ను తయారు చేసే క్రమములో క్రీస్తు శకము *(Anno Domini)* అనే కొత్త శకాన్ని యేసు క్రీస్తు జన్మదిన తేదీ నుండి రూపొందించాలని నిర్ణయించుకున్నాడు.

ఎందుకంటే అతని కంటే ముందు అలెగ్జాండ్రియాకు చెందిన సిరిల్ *(Patriarch Cyril of Alexandria)* క్రీ.శ.430 ప్రాంతంలో క్రీ.శ.437–531 వరకు తయారు చేశాడు. అయితే సిరిల్ రోమన్ శకము (AUC) ప్రకారంగా కాకుండా రోమన్ ఎంపరర్ అయిన డయోక్లేషియన్ శకము *(Diocletian era (Latin: anno Diocletiani)* ఆధారం చేసుకొని ఈ టేబుల్‌ను తయారు చేశాడు. డయోక్లేషియన్ శకము 20 నవంబర్, 284 నుండి ప్రారంభమౌతుంది. ఈ డయోక్లేషియన్ క్రైస్తవులను ఎంతగానో చిత్రహింసలకు గురి చేసిన రాజు. అందుకని డయోక్లేషియన్ శకాన్ని డెన్నిస్ ఉపయోగించడానికి ఇష్టపడక మన ప్రభువైన యేసుక్రీస్తు శకాన్ని ఉపయోగించాలని అనుకున్నాడు. నిజానికి క్రీస్తు జన్మదినమునకు సంబంధించి బైబిల్లో ఎలాంటి ఆధారాలు లేవు. ఇందుకోసం వివిధ దేశాలు తిరిగాడు, ఎన్నో పుస్తకాలు తిరిగేసాడు, మరెన్నో పరిశోధనలు చేశాడు.

రెండవ-మూడవ శతాబ్దానికి చెందిన క్రైస్తవ చరిత్రకారులైన 'హిప్పోలిటస్' *(Hippolytus of Rome)* క్రీ.శ.211లోను మరియు 'సెక్టస్ జూలియస్ ఆఫ్రికానస్' *(Sextus Julius Africanus)* క్రీ.శ.221లోను వారు రాసిన గ్రంథాలలో క్రీస్తు డిసెంబర్ 25ననే జన్మించినట్లు రాసారు.

అంతేగాకుండా క్రీ.శ. 354లో ప్రచురించబడిన ఫిలోకాలియన్ క్యాలెండర్‌లోని పార్టు-8లో నూతన సంవత్సరాదికి 8 రోజుల ముందు అంటే డిసెంబర్ 25న క్రీస్తు జన్మించినట్లుగా పేర్కొనబడింది.

అయితే అప్పటికే రోమన్ సంఘం డిసెంబర్ 25న క్రీస్తు పుట్టిన రోజును జరుపుకుంటోంది. డెన్నిస్ ది లిటిల్ ఈ విషయాలన్నిటిని దృష్టిలో ఉంచుకొని క్రీస్తు సున్నతి పొందిన రోజు (8వ రోజు) నుండి తన శకాన్ని ప్రారంభించాడు. అంటే క్రీస్తు జన్మదినం క్రీ.పూ. 1, డిసెంబర్ 25 రోజున అవుతుందన్నమాట. అప్పుడు అమలులో ఉన్న రోమన్ శకములో 754వ సంవత్సరాన్ని క్రీ.శ. 1 గా తీసుకొని తన అన్నో డోమిని శకాన్ని తయారు చేశాడు.

ఆ విధంగా డెన్నిస్ ది లిటిల్ చేత తయారు చేయబడిన అన్నో డోమిని సుమారు 2 శతాబ్దాల తరువాత క్రీ.శ. 748లో అమలులోకి వచ్చింది. అదే ఇప్పుడు మనం వాడుతున్నాము. అయితే క్రీ.శ. 1219లో సంవత్సర సంఖ్య ప్రక్కన క్రీ.శ. అని సూచించడానికి *A.D. (Anno Domini)* అని వ్రాయడం ప్రారంభించారు.

## డెన్నిస్ ది లిటిల్ లెక్క తప్పింది :

అయితే క్రీస్తు పుట్టిన సంవత్సరాన్ని నిర్ణయించడంలో డెన్నిస్ ది లిటిల్ పొరపాటు చేశాడు. చరిత్రకారులు చేసిన పరిశోధనల ఆధారంగా యేసు ప్రభువు, క్రీ.పూ. 6-3 మధ్యలో జన్మించాడని తేలింది. అలాగే క్రీ.పూ. 1వ సంవత్సరం తర్వాత క్రీ.శ. 1 వచ్చేస్తుంది. మధ్యలో **'సున్న'** అనే సంవత్సరం లేదు. అంతేగాకుండా కొత్త శకం ప్రకారం క్రీస్తు జన్మదినం జనవరి 1 అవ్వాలి గదా! కాని అప్పటికే కేథలిక్కు సంఘం జీసస్ పుట్టిన రోజు అయిన క్రిస్మస్‌ను డిసెంబర్ 25న జరుపుకుంటోంది. కాబట్టి దానిని మార్చే ప్రయత్నం చేయలేదు. ఒకవేళ మార్చే ప్రయత్నం చేస్తే తాను కొత్తగా తయారు చేసిన క్రీస్తు శకాన్ని అంగీకరించడం అంత సులభ సాధ్యం కాదని డెన్నిస్‌కు బాగా తెలుసు. అంతేగాకుండా జూలియన్ క్యాలెండర్ ప్రారంభ సమయంలో క్రీ.పూ. 46లో అదనంగా చేర్చిన 90 రోజులను కూడా లెక్కలోకి తీసుకోలేదు.

ఈ విధంగా తయారైన అన్నో డోమినిలో యేసు ప్రభువు తనకంటే 4-5 సంవత్సరాల ముందు పుట్టాడు. అయితే ఈ తప్పులను సవరించకుండానే క్రీస్తు శకం అనేది వాడుకలోనికి వచ్చేసింది. చరిత్ర పరిశోధనలో సున్న సంవత్సరం లేకపోవడాన్ని, యేసు ప్రభువు జననం 4-5 సంవత్సరాల క్రితం జరగడాన్ని గుర్తు పెట్టుకోవాల్సి ఉంటుంది.

కొంత మంది డెన్నిస్ ది లిటిల్ చరిత్ర పరిశోధన చేసి **'కురేనియస్'** కాలంలో యేసు ప్రభువు పుట్టినప్పుడు జరిగిన జనాభా లెక్కలను పరిశీలించి, లెక్కలు వేసి యేసు ప్రభువు జన్మించిన తేది డిసెంబర్ 25 అని నిరూపించాడని చెబుతున్నారు. వాళ్లకు తెలియని విషయం ఏమిటంటే జోసీఫస్ లెక్కల ప్రకారం కురేనియస్ క్రీ.శ. 6లో సిరియాకు గవర్నర్ అయ్యాడు. మరి యేసు ప్రభువు క్రీ.పూ. 6-3 మధ్యలో జన్మించినట్లు చరిత్రకారులు చెబుతున్నారు. ఈ విషయంలో లూకా అంచనా తప్పా? లేదా జోసీఫస్ తప్పుగా రాసాడా? అనేది చరిత్రకారులకు, బైబిల్ పండితులకు ఇప్పటికీ సమాధానం దొరకని ప్రశ్నగానే మిగిలిపోయింది. చరిత్ర మీద సరియైన అవగాహనలేని కొందరు క్రీస్తు డిసెంబర్ 25న జన్మించాడని నిరూపించడానికి అత్యుత్సాహం ప్రదర్శిస్తున్నారు. అయినా డెన్నిస్, క్రీస్తు పుట్టిన సంవత్సరాన్నే సరిగ్గా లెక్కగట్టలేక పోయాడు, ఇక నెల, తేదీని అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలడు? సరే ఒకవేళ క్రీస్తు డిసెంబర్ 25 రోజే జన్మించాడనే అనుకుందాం, కనీసం బైబిల్లో పరోక్షంగా చెప్పబడిన విషయాలకు సరితూగాలి గదా! ఒకసారి బైబిల్‌లో ఉన్న పరోక్ష ఆధారాలను చూద్దాం!

**చరిత్ర మీద సరియైన అవగాహనలేని కొందరు క్రీస్తు డిసెంబర్ 25న జన్మించాడని నిరూపించడానికి అత్యుత్సాహం ప్రదర్శిస్తున్నారు. అయినా డెన్నిస్, క్రీస్తు పుట్టిన సంవత్సరాన్నే సరిగ్గా లెక్కగట్టలేక పోయాడు, ఇక నెల, తేదీని అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలడు? సరే ఒకవేళ క్రీస్తు డిసెంబర్ 25 రోజే జన్మించాడనే అనుకుందాం, కనీసం బైబిల్లో పరోక్షంగా చెప్పబడిన విషయాలకు సరితూగాలి గదా!**

## బైబిల్ ప్రకారం క్రీస్తు ఎప్పుడు పుట్టాడు :

బైబిల్లో యేసు ప్రభువు పుట్టిన రోజుకు సంబంధించి ఎలాంటి ఆధారాలు లేవు. కాని కొన్ని పరోక్ష ఆధారాలు ఉన్నాయి. ఒకసారి వాటిని పరిశీలిద్దాం!

**మొదటి ఆధారం :** లూకా సువార్తలో, యేసు ప్రభువు జన్మించిన సమయంలో కొందరు గొఱ్ఱెల కాపరులు పొలములో ఉండి రాత్రివేళ తమ మందను కాచుకొనుచున్నారని చెప్పబడింది. (లూకా 2:8)

ఇశ్రాయేల్/పాలస్తీనా వాతావరణ పరిస్థితులను గమనించినట్లయితే, మే నుండి సెప్టెంబర్ వరకు వాతావరం పొడిగా ఉండే వేసవికాలం, అక్టోబర్ నుండి ఏప్రిల్ వరకు వాతావరణం చల్లగా ఉండే వర్షాకాలం. అక్టోబర్ నుండి ఏప్రిల్ మాసాలలో వాతావరణం చల్లగా ఉండడమే గాకుండా వర్షాలు కూడా పడుతుంటాయి. కాబట్టి ఆ కాలములో గొఱ్ఱెల కాపరులు రాత్రివేళ పొలములో తమ మందను మేపడానికి అసలు అవకాశమే లేదు. మే నుండి సెప్టెంబర్ వరకు మాత్రమే కాపరులు తమ మందలను రాత్రివేళ పొలములో కాయడానికి అవకాశం ఉంది. కాబట్టి ప్రభువు జన్మించిన కాలము మే నుండి సెప్టెంబర్ మధ్య కాలంలోనే అయ్యుండాలి.

**రెండవ ఆధారం :** ప్రభువు 30 యేండ్ల వయసులో పరిచర్య మొదలు పెట్టి మూడున్నర సంవత్సరాలు పరిచర్య చేసి సిలువలో మరణించాడు. అంటే ప్రభువు మరణించిన మాసము నుండి 6 నెలలు వెనక్కి వెళితే ప్రభువు పుట్టిన నెల సుమారుగా తెలుసుకోవచ్చు. యేసు ప్రభువు యూదుల పస్కా పండుగ దినాలలో సిలువ వేయబడ్డాడు. యూదుల పస్కా పండుగ మార్చి-ఏప్రిల్ నెల మధ్యలో వస్తుంది. అంటే అక్కడి నుండి 6 నెలలు వెనక్కి అంటే సెప్టెంబర్-అక్టోబర్ మాసాలలో ప్రభువు జన్మించడానికి అవకాశం ఉన్నది.

**మూడవ ఆధారం :** బాప్తిస్మమిచ్చు యోహాను యేసు ప్రభువు కంటే 6 నెలలు ముందు పుట్టాడు. మనం యోహాను ఎప్పుడు పుట్టాడో తెలుసుకోగలిగితే అతని తర్వాత 6 నెలలు యేసు ప్రభువు పుట్టినట్లుగా గుర్తించవచ్చును.

లూకా 1:5-37 : "యూదయదేశపు రాజైన హేరోదు దినములలో అబీయా తరగతిలోనున్న జెకర్యా అను ఒక యాజకుడుండెను. అతని భార్య అహరోను కుమార్తెలలో ఒకతె; ఆమె పేరు ఎలీసబెతు ..... ..... ...... ...... ..... ....... ..... అతడు సేవచేయు దినములు సంపూర్ణమైనప్పుడు తన యింటికి వెళ్లెను. ఆ దినములైన పిమ్మట అతని భార్య ఎలీసబెతు గర్భవతియై -మనుష్యులలో నాకుండిన అవమానమును తీసి వేయుటకు నన్ను కటాక్షించిన దినములలో ప్రభువు ఈలాగున చేసెననుకొని, అయిదు నెలలు ఇతరుల కంట బడకుండెను. ఆరవ నెలలో గబ్రియేలను దేవదూత గలిలయలోని నజరేతను ఊరిలో, దావీదు వంశస్థుడైన యోసేపను ఒక పురుషునికి ప్రధానము చేయబడిన కన్యక యొద్దకు దేవుని చేత పంపబడెను. ఆ కన్యక పేరు మరియ. ఆ దూత లోపలికి వచ్చి ఆమెను చూచి -దయాప్రాప్తురాలా నీకు శుభము; ప్రభువు నీకు తోడైయున్నాడని చెప్పెను. ఆమె ఆ మాటకు బహుగా తొందరపడి -ఈ శుభవచన మేమిటో అని ఆలోచించు కొనుచుండగా దూత -మరియా, భయపడకుము; దేవునివలన నీవు కృపపొందితివి. ఇదిగో నీవు గర్భము ధరించి కుమారుని కని ఆయనకు యేసు అను పేరు పెట్టుదువు; ఆయన గొప్పవాడై సర్వోన్నతుని కుమారుడనబడును; ప్రభువైన దేవుడు ఆయన తండ్రియైన దావీదు సింహాసనమును ఆయన కిచ్చును. ఆయన యాకోబు వంశస్థులను యుగయుగములు ఏలును; ఆయన రాజ్యము అంతములేనిదై యుండునని ఆమెతో చెప్పెను. అందుకు మరియ -నేను పురుషుని ఎరుగనిదాననే; యిదేలాగు జరుగునని దూతతో అనగా, దూత -పరిశుద్ధాత్మ నీ మీదికి వచ్చును; సర్వోన్నతుని శక్తి నిన్ను కమ్ముకొనును గనుక పుట్టబోవు శిశువు పరిశుద్ధుడై దేవుని కుమారుడనబడును. మరియు నీ బంధువురాలు ఎలీసబెతు కూడ తన వృద్ధాప్యమందు ఒక కుమారుని గర్భము ధరించియున్నది; గొడ్రాలనబడిన ఆమెకు ఇది ఆరవమాసము; దేవుడు చెప్పిన యేమాటయైనను నిరర్థకము కానేరదని ఆమెతో చెప్పెను."

ఇప్పుడు మనం జెకర్యాకు సంబంధించిన అబీయా తరగతి ఏ మాసములో వస్తుందో ఒకసారి చూద్దాం!

1దినవృత్తాంతాలు 24:6-19: **"లేవీయులలో శాస్త్రిగానున్న నెతనేలు కుమారుడగు షెమయా రాజు ఎదుటను, అధిపతుల యెదుటను, యాజకుడైన సాదోకు ఎదుటను, అబ్యాతారు కుమారుడైన అహీమెలెకు ఎదుటను, యాజకులయెదుటను, లేవీయుల యెదుటను, పితరులయిండ్ల**

**పెద్దలైన వారి యెదుటను వారి పేళ్లు దాఖలు చేసెను; ఒక్కొక్క పాత్రలోనుండి యొక పితరుని యింటి చీటి ఎలియాజరు పేరటను ఇంకొకటి ఈతామారు పేరటను తీయబడెను. మొదటి చీటి యెహోయారీబునకు, రెండవది యెదాయాకు, మూడవది హారీమునకు, నాలుగవది శెయొరీమునకు, అయిదవది మల్కీయాకు, ఆరవది మీయామినుకు, ఏడవది హక్కోజునకు, ఎనిమిదవది అబీయాకు, తొమ్మిదవది యేషూవకు పదియవది షెకన్యాకు పద కొండవది ఎల్యాషీబునకు, పండ్రెండవది యాకీమునకు, పదుమూడవది హుప్పాకు, పదునాలుగవది యెషెబాబు నకు, పదునయిదవది బిల్గాకు, పదునారవది ఇమ్మేరు నకు, పదునేడవది హెజీరునకు, పదునెనిమిదవది హప్పి స్సేసునకు, పందొమ్మిదవది పెతహయాకు ఇరువదియవది యెహెజ్కేలునకు, ఇరువదియొకటవది యాకీనునకు, ఇరువది రెండవది గామూలునకు, ఇరువది మూడవది దెలాయ్యాకు, ఇరువదినాలుగవది మయజ్యాకు పడెను. ఇశ్రాయేలీయుల దేవుడైన యెహోవావారి పితరుడగు అహరోనునకు ఆజ్ఞాపించిన కట్టడ ప్రకారముగా వారు తమ పద్ధతి చొప్పున యెహోవా మందిరములో ప్రవేశించి చేయవలసిన సేవాధర్మము ఈలాగున ఏర్పాటు ఆయెను.”**

పై వచనాల ప్రకారం పక్షానికి ఒక్కరు చొప్పున కేటాయించగా అబీయాకు 8వ పక్షము వచ్చినది. అంటే నాలుగవ మాసములో రెండవ పక్షము అన్నమాట. యూదుల క్యాలెండర్ ఈ క్రింది విధంగా ఉంటుంది.

| | |
|---|---|
| **ఏతనీము/తిష్రీ** *(Tishrei) (Sep-Oct)* | **- 30 రోజులు** |
| **బుల్/హేష్వన్** *(Heshvan) (Oct-Nov)* | **- 29/30 రోజులు** |
| **కిస్లెవ్** *(Kislev) (Nov-Dec)* | **- 30/29 రోజులు** |
| **తేబేత్** *(Tevet) (Dec-Jan)* | **- 29 రోజులు** |
| **షెబత్** *(Shevat) (Jan-Feb)* | **- 30 రోజులు** |
| **అదర్** *(Adar) (Feb-Mar)* | **- 29/30 రోజులు** |
| **అబీబ్/నీసాను** *(Nissan) (Mar-Apr)* | **- 30 రోజులు** |
| **జిఫ్/ఇయార్** *(Iyar) (Apr-May)* | **- 29 రోజులు** |
| **సివాన్** *(Sivan) (May-Jun)* | **- 30 రోజులు** |
| **తమ్మూజ్** *(Tammuz) (Jun-Jul)* | **- 29 రోజులు** |
| **అబ్/ఆవ్** *(Av) (Jul-Aug)* | **- 30 రోజులు** |
| **ఎల్లూల్** *(Elul) (Aug-Sep)* | **- 29 రోజులు** |

మామూలుగా తిష్రీ యూదులకు మొదటి మాసం. వారి క్యాలెండర్ తిష్రీ మాసంతో మొదలవుతుంది. తిష్రీ మొదటి రోజున సంవత్సరాదిని *(Rosh Hashana)* జరుపుకుంటారు. కాని మత సంబంధమైన వాటి కోసం అబీబు/నీసానును మొదటి మాసంగా ఉపయోగిస్తారు (నిర్గమ 12:2).

ఇది మతపరమైనది కాబట్టి తమ్మూజ్ నాలుగవ మాసం అవుతుంది. తమ్మూజు రెండవ పక్షములో జెకర్యా వంతు వస్తుందన్నమాట. లూకా సువార్త 1:23, 24 ప్రకారం జెకర్యా సేవచేయు దినములు అయిపోయిన తర్వాత ఎలీసబెతు గర్భవతి అయినదని తెలుస్తోంది. అంటే 5వ మాసం అయిన ఆవ్ మాసంలో ఎలీసబెతు గర్భం ధరించి యుండవచ్చును. వెంటనే కాకపోయినా కనీసం 2వ పక్షంలో అయినా గర్భం దాల్చియుండవచ్చును. అక్కడి నుండి 5 నెలలు గడిచిన తర్వాత 6వ నెలలో అంటే తేబెత్‌లో రెండవ పక్షంలో గబ్రియేలు దేవదూత కన్య మరియను దర్శించడం జరిగిందన్న మాట! అదే మాసంలో ఎలీసబెత్‌ను చూడడానికి వెళ్లింది.

ఆ తర్వాత షెబత్ మాసం మొదటి పక్షంలో కన్య మరియ గర్భం ధరించి యుండవచ్చును. అక్కడి నుండి గర్భధారణ రోజులైన 280 రోజులను లెక్కిస్తే ఎనిమిదవ నెల అయిన బుల్/హేష్వన్ మాసం మొదటి పక్షంలో నిండుతాయి. (పైన యూదుల మాసాల ప్రక్కన ఆ మాసాలలో వచ్చే రోజులను కూడా ఇవ్వడం జరిగింది. వాటి ప్రకారం లెక్కించండి.) అంటే బుల్/హేష్వన్ మాసం 10-15వ రోజుల మధ్యన యేసు ప్రభువు జన్మించాడని చెప్పవచ్చును.

అయితే యూదులు మేటన్ చక్రాన్ని ఎప్పటి నుండో ఉపయోగిస్తున్నారు కాబట్టి ఒకవేళ యేసు ప్రభువు పుట్టిన సంవత్సరంలో (క్రీ.పూ. 3 మరియు 6 సంవత్సరాలలో అధిక మాసాన్ని యూదులు కలుపుకున్నారు) ఒక అధిక మాసాన్ని గనుక ఉపయోగించినట్లయితే తిష్రీ మాసం 10-15వ తేదీల మధ్యన యేసు ప్రభువు జన్మిస్తాడు. అంటే మన క్యాలెండర్ ప్రకారం సెప్టెంబర్ మూడవ వారం లేదా అక్టోబర్ మూడవ వారంలో యేసు ప్రభువు జన్మించడానికి ఆస్కారం ఉన్నది.

అయితే చాలా మంది బైబిలు పండితులు యూదుల సుక్కోతు పండుగ దినాన అంటే తిష్రీ 15వ తేదీన యేసు ప్రభువు జన్మించాడని నమ్ముతుంటారు. పర్ణశాలల పండుగ

అశాశ్వతమైన ఈ లోక నివాసాన్ని సూచిస్తుండగా, పరలోకంలో శాశ్వత నివాసాలను సమకూర్చడానికి అదే రోజున యేసు ప్రభువు భూలోకంలో అవతరించడం యాదృశ్చికం కాకపోవచ్చును.

బైబిల్లో మనకు ఉన్నటువంటి పరోక్ష ఆధారాలను పైన పరిశీలించాము. వాటి ఆధారంగా, **సెప్టెంబర్ లేదా అక్టోబర్** మాసాలలో యేసు ప్రభువు జన్మించడానికే అవకాశాలు ఎక్కువగా ఉన్నాయి. డిసెంబర్‌లో యేసు ప్రభువు జన్మించాడనేది నూటికి నూరు శాతం తప్పే అవుతుంది. ఒకవేళ చారిత్రక ఋజువులు దొరికినా అవి బైబిల్లో చెప్పబడిన ఋజువులకు భిన్నంగా ఉండడానికి వీలులేదు కదా!

## డిసెంబర్ 25 రోజుననే ఎందుకు?

కాన్స్‌స్టాంటైన్ క్రైస్తవుడిగా మారాక, రోమన్లను క్రైస్తవ మతంలోకి ఆకర్శించడానికి, డిసెంబర్ 25న రోమన్‌లు జరుపుకునే పండుగైన 'అజేయుడైన సూర్య దేవుని జన్మ దినోత్సవం' *(dies natalis solis invicti)* అనే పండుగను క్రీస్తు పుట్టిన రోజుగా మార్చాడని చెబుతుంటారు.

రోమన్లు అజేయుడైన సూర్య దేవుని జన్మదినోత్సవాన్ని ఎప్పటి నుండి జరుపుకుంటున్నారో ఒకసారి చారిత్రక పరిశోధన చేద్దాం.

రోమన్లు జూపిటర్ *(Jupiter : god of the sky and thunder and king of the gods)*, మార్స్ *(Mars : god of war and also an agricultural guardian)*, సాటర్న్, జానుస్, అపోల్లో, వల్కన్ *(Vulcan : is the god of fire)*, డయానా, సోల్ *(Sol : God of the Sun)*.... ఇలా చెప్పుకుంటూ పోతే చాలా పెద్ద లిస్టే ఉంటుంది. అయితే మనం సోల్ ఇన్విక్టస్ *(Sol Invictus)* గురించి తెలుసుకుందాం.

రోమన్ మూలాల ప్రకారం రోమ్యులస్ చక్రవర్తి తర్వాత కొంత కాలానికే టైటస్ టాటియస్ 'సోల్' (సూర్యుడు)ను ఆరాధించడం ప్రవేశ పెట్టాడు. ఆ కాలంలో సోల్‌కు మందిరం కూడా ఉండేది. ప్రతి సంవత్సరం డిసెంబర్ 11న ఉత్సవం జరుపుకునే వారు. అయితే కొన్ని శతాబ్దాల తర్వాత సూర్యున్ని- జూపిటర్, సాటర్న్, మార్స్ తదితర దేవుళ్లు ఆక్రమించి అధిగమించేశారు. జూపిటర్‌కు, సాటర్న్‌కు ప్రాధాన్యత పెరిగింది. ప్రాచీన రోమన్ సామ్రాజ్యంలో డిసెంబర్ మాసంలో వచ్చే 'సాటర్నేలియా' విపరీతమైన ప్రజాధరణ పొందింది. కాగా క్రీ.శ. మొదటి శతాబ్దంలో మళ్లీ 'సోల్' ఆరాధన ఉనికిలోకి వచ్చిందని చెబుతారు.

అయితే క్రీ.శ.218లో చక్రవర్తి అయిన 'మార్కస్ ఆరేలియస్ ఆంటోనినస్' *(Marcus Aurelius Antoninus)* సిరియాలోని ఎమెసాలో ప్రాచుర్యం పొందిన ఎలగాబలస్ *(Elagabalus : Arab-Roman sun god)*ను రోమ్‌కు తీసుకొనివచ్చాడు. ఎందుకంటే చక్రవర్తి కాక ముందు సిరియన్ ఎమెసాలోని 'సూర్య దేవుడైన ఎలగాబలస్' *(sun god Elagabal)* కు ప్రధాన పూజారిగా ఉండేవాడు. ఇతనికి తన తల్లిదండ్రులు పెట్టిన పేరు 'వెరియస్ అవిటస్ బాసియానస్' *(Varius Avitus Bassianus)*. అతని అమ్మమ్మ అయిన జూలియా మేసా *(Julia Maesa)* పన్నిన పన్నాగం వల్ల, సైన్యాధిపతి పబ్లియస్ వాలేరియస్ కోమాజోన్ *(Publius Valerius Comazon)* సహాయంతో మే 16, 218లో 14 యేండ్ల వయసులో రోమ్ చక్రవర్తిగా గద్దెనెక్కాడు. అటు తర్వాత సిరియన్ సూర్య దేవుడైన ఎలగాబలస్‌ను రోమ్‌కు తరలించాడు. రోమన్ల దేవుళ్లందరికి పైగా ఎలగాబలస్‌ను హెచ్చించాడు. రోమ్‌లోని ఏడుకొండల మధ్యన ఉన్న 'పాలిటిన్' కొండ *(Palatine Hill)* ఈశాన్య మూలలో 'కొలోసియం' దగ్గరలో 'ఎలగాబాలియం' *(Elagabalium)* అని పిలువబడే ఒక విలాసవంతమైన ఆలయాన్ని నిర్మించాడు. అందులో సిరియన్ ఎమెసా నుండి తెప్పించిన నల్లని శంఖు ఆకారంలో ఉన్న రాయిని (ఉల్క రాయి) ఆ ఆలయంలో ప్రతిష్టించాడు. రోమన్ సామ్రాజ్యంలోని ప్రతి దేవాలయంలో ఉన్న దేవుళ్లందరిని ఇక్కడికి రప్పించాడు. ఆయా దేవుళ్ల ఆచారాలను కలిపేసాడు. అంతేగాకుండా యూదులను, క్రైస్తవులను కూడా వారి మతాచారాలను ఇక్కడ పాటించేలా వారిని ఒత్తిడి చేసేవాడు. ప్రతి సంవత్సరం డిసెంబర్‌లో వచ్చే దక్షిణాయనాంతంలో *(winter solstice)* ఎలగాబలస్‌కు పెద్ద పండుగను ఏర్పాటు చేసి ఊరేగింపులో ప్రజల గుంపులోకి కానుకలు విసిరేసేవాడు. ప్రజలందరికి ఉచితంగా విందు భోజనాలు ఏర్పాటు చేసేవాడు. ఎలాగైనా సిరియన్ సూర్య దేవునికి రోమ్‌లో ప్రాధాన్యత కల్పించాలని చాలా ప్రయత్నం చేశాడు. దాని కోసం ఎలగాబాలియంకు తనే స్వయంగా ప్రధాన

పూజారిగా ఉన్నాడు. అయితే ఇతని ప్రవర్తన, లైంగిక సంబంధాలు, మతపరమైన పిచ్చితనం రాజ్యంలో కొంతమంది వ్యతిరేకతకు కారణమైంది. దాంతో క్రీ.శ.222లో అతడు హత్య చేయబడ్డాడు. అతని హత్యానంతరం అతను ప్రవేశపెట్టిన మతాచారాలతో పాటు సూర్య దేవుడు కూడా పక్కకు నెట్టబడ్డాడు.

అయితే అతని తర్వాత కొంత కాలానికి అంటే క్రీ.శ.270లో చక్రవర్తి అయిన ఆరేలియన్ *(Aurelian)* సూర్య దేవున్ని ప్రధాన దైవంగా బలపరిచాడు. సూర్యునికి ఒక క్రొత్త ఆలయం కట్టించి క్రీ.శ.274 డిసెంబర్ 25న ప్రతిష్ఠించాడు. అప్పటి నుండి ప్రతి సంవత్సరం డిసెంబర్ 25వ తేదీన 'అజేయుడైన సూర్య దేవుని జన్మ దినోత్సవం' *(dies natalis solis invicti)* ఘనంగా జరుపబడుతోంది. ఆరేలియన్ ఉద్దేశ్యం ప్రకారం అందరూ విశ్వసించగల ఒకే దేవుడు ఉండాలి. అతను 'ఒకే విశ్వాసం-ఒకే సామ్రాజ్యం' సూత్రాన్ని పాటించాడు. అతని తర్వాత ఇదే సూత్రాన్ని డయోక్లేషియన్ పాటించడం వల్లే క్రైస్తవులు ఘోరంగా హింసించబడ్డారు. అయితే క్రీ.శ.387 వరకు సోల్ ఇన్విక్టస్‌ను రోమన్లు గొప్ప ఉత్సవంగా జరుపుకున్నట్లుగా చరిత్ర చెబుతోంది. అయితే 5వ శతాబ్దం తర్వాత దాని యొక్క ప్రాబల్యం పూర్తిగా పోయింది. ఆ తర్వాత దాదాపు రోమన్ సామ్రాజ్యమంతా కూడా క్రైస్తవులుగా మారిపోయి వుండవచ్చును.

అయితే చాలా మంది చరిత్రకారులు సిరియన్ సూర్య దేవుడైన ఎలగాబాలస్ మరియు ఆరేలియన్ ప్రతిష్ఠించిన సోల్ ఇన్‌విక్టస్ ఒక్కరు కాదని ఇద్దరు వేరు వేరు సూర్య దేవుళ్లని అంటారు. సరే వారు ఒక్కరైనా వేరైనా క్రీ.శ.274 నుండి మాత్రమే ఈ పండుగను రోమన్లు జరుపుకుంటున్నారు. మరి మన క్రైస్తవ చరిత్రకారులు క్రీ.శ.211లోనే యేసు ప్రభువు డిసెంబర్ 25న జన్మించినట్లు వ్రాశారు. కాబట్టి వారు సోల్ ఇన్విక్టస్ పుట్టిన రోజును క్రీస్తుకు ఆపాదించలేదని అర్థమౌతోంది. **మరెందుకు డిసెంబర్ 25 తీసుకోవాల్సి వచ్చింది?**

రెండవ-మూడవ శతాబ్ధానికి చెందిన క్రైస్తవ చరిత్రకారులైన 'హిప్పోలిటస్' *(Hippolytus of Rome)* క్రీ.శ.211లోను మరియు 'సెక్టస్ జూలియస్ ఆఫ్రికానస్' *(Sextus Julius Africanus)* క్రీ.శ.221లోను వారు రాసిన గ్రంథాలలో క్రీస్తు డిసెంబర్ 25ననే జన్మించినట్లు రాసారు. కారణమేమిటంటే, ఆ కాలంలో గొప్ప ప్రవక్తలు మరణించిన తర్వాత అదే రోజున స్త్రీ గర్భంలో ప్రవేశిస్తారని విశ్వసించేవారు. యేసు క్రీస్తు యూదుల పస్కా పండుగ సమయంలో అంటే మార్చి 25న సిలువ మరణం పొందినట్లు అందరూ భావించేవారు. ఆ కారణంగా మార్చి 25న గర్భంలో ప్రవేశించినట్లు లెక్కలోకి తీసుకొంటే 9 నెలల తర్వాత డిసెంబర్ 25న భూమి మీద పుట్టిన రోజు అవుతుంది. అందుకని వారందరూ కూడా మార్చి 25ను దృష్టిలో పెట్టుకొని ఆ విధంగా లెక్కలు వేశారు. మార్చి 25కు ఉన్న ఇంకో ప్రత్యేకత ఏమిటంటే ఆ కాలంలో అదే రోజు వసంత విషువత్తు అవుతుంది. మొదటి శతాబ్దాలలో క్రీస్తును మార్చి 25న సిలువ వేసినట్లు చెప్పుకునేవారు. దాన్నే అందరూ విశ్వసించేవారు. అందువలన వారి దృష్టి అంతా మార్చి 25 మీదనే తప్ప వారికి డిసెంబర్ 25 మీద ప్రత్యేకాభిమానం ఏమీ లేదు.

అయితే క్రీ.శ.354లో ప్రచురించబడిన ఫిలోకాలియన్ క్యాలెండర్‌లోని పార్టు-6లో డిసెంబర్ 25న సోల్ ఇన్విక్టస్‌ను పొందుపరిచింది. అలాగే పార్టు-8లో నూతన సంవత్సరాదికి 8 రోజుల ముందు అంటే డిసెంబర్ 25న క్రీస్తు జన్మించినట్లుగా పేర్కొనబడింది. ఫిలోకాలియన్ క్యాలెండర్‌నే క్రానోగ్రాఫ్ ఆఫ్ 354 లేదా క్యాలెండర్ ఆఫ్ 354 అంటారు.

ఆ విధంగా డిసెంబర్ 25 క్రీస్తు పుట్టిన రోజుగా భావించబడింది. అయితే క్రీ.శ.12వ శతాబ్దం నుండి అనేక ఊహాగానాలు బయలుదేరాయి. సోల్ ఇన్విక్టస్ పండుగనే క్రీస్తు జన్మదినంగా మార్చారని కొందరు, ఆరేలియన్ *(Aurelian)* చక్రవర్తే క్రిస్టియన్స్‌ను లోబర్చు కోవడానికి సోల్ ఇన్విక్టస్ పండుగకు డిసెంబర్ 25ను ఎంచుకున్నాడని మరికొందరు చెప్పుకొచ్చారు.

ఏది ఏమైనా రోమన్ల పూర్వ మతాచారాలు క్రిస్మస్ పండుగ సెలబ్రేషన్స్‌లో ప్రభావం చూపించాయనడంలో సందేహం లేదు. రోమన్లు డిసెంబర్ 17-23 మధ్యలో జరుపుకేనే 'సాటర్నేలియా' *(Saturnalia)* అత్యంత ప్రజాదరణ పొందిన పండుగ. ఈ పండుగకు సంబంధించిన ఆచారాలన్నీ మనకు క్రిస్మస్ సెలబ్రేషన్స్‌లో అక్కడక్కడ కొన్ని దేశాల్లో ఇప్పటికీ మనకు కనిపిస్తూనే ఉంటాయి.

చాలా క్రైస్తవ దేశాల్లో బైబిల్‌కు సంబంధంలేని ఆచారాలతో పండుగను జరుపుకుంటున్నారు. సాంటాక్లాజ్, బహుమతులు, క్రిస్మస్ ఈవ్, కేరల్స్, బాక్సింగ్ డే, ఎపిఫనీ... ఇలా పండుగను చాలా సంతోషంగా ఎంజాయ్ చేస్తూ జరపుకుంటారు. కొన్ని దేశాల్లో సెప్టెంబర్ నుండి జనవరి వరకు సెలెబ్రేషన్స్ జరుగుతుంటాయి. క్రైస్తవ దేశాలు కాని దేశాలలో మిని క్రిస్మస్ అని, సెమీ క్రిస్మస్ అని క్రిస్మస్‌కు ముందు రోజులలో జరుపుకుంటూ, ఈ వంకతో మేము సువార్త ప్రకటిస్తున్నామని చెప్పుకొంటున్నారు. ఈ ఆచారాలు ఏవీ కూడా బైబిల్లో నుండి వచ్చినవి కావు అని మనందరికి తెలిసిన విషయమే!

## చరిత్రలో 11 రోజులు మాయం :

జూలియన్ క్యాలండర్‌లో ఉన్న 12 ని॥ 12.5 సె॥ దోషము 16వ శతాబ్ధము వచ్చేసరికి 10 రోజులు అయ్యింది. జూలియన్ క్యాలెండర్ సంస్కరణలో భాగంగా క్రీ.శ.1581లో పోప్ గ్రెగరీ తన ఆజ్ఞను జారీ చేశాడు; **‘రాబోయే 1582వ సం॥ అక్టోబర్ నెలలో 5 నుండి 14 వరకూ గల తేదీలను వదిలెయ్యాలి’** అని. ఈవిధంగా గ్రెగోరియన్ క్యాలండర్ అవతరించింది. కేథలిక్కు దేశాలు వెంటనే ఈ మార్పును అంగీకరించాయి. ఆ తర్వాత జర్మనీ 1699లో, ఇంగ్లాండు 1752 సెప్టెంబర్‌లో గ్రెగొరియన్ క్యాలెండర్‌ను ఆమోదించాయి. 1752 సెప్టెంబర్‌లో ఆ దోషము 11 రోజులు అయ్యింది. 1752 సెప్టెంబర్ మాసంలో 2వ తేదీ తర్వాత 14వ తేదీ వస్తుంది. మధ్యలో ఉన్న 11 రోజులు తీసివేశారు. అలాంటప్పుడు డిసెంబర్ 25, 11 రోజుల తర్వాత జనవరి 5న వస్తుంది. ప్రస్తుత సంవత్సరాలలో ఆ దోషము 13గా ఉంది. అంటే జనవరి 7న అవుతుంది. మరి మనం జనవరి 7న క్రిస్మస్‌ను సెలబ్రేట్ చేసుకోవడం లేదుగా! కానీ, ఇప్పటికీ కొన్ని క్రైస్తవ సంఘాలు జూలియన్ క్యాలెండర్ ప్రకారమే డిసెంబర్ 25న అంటే మన క్యాలెండర్ ప్రకారం జనవరి 7న క్రిస్మస్‌ను సెలబ్రేట్ చేసుకుంటున్నాయి. ఇంతకీ ఏది కరెక్టు? డిసెంబర్ 25 కరెక్టా? లేదా జనవరి 7 కరెక్టా?

**ఒకసారి ఆలోచించండి! యేసు ప్రభువు పునరుత్థానానికి ‘ఈస్టర్’ అని సంబంధంలేని పేరు (పాగన్ దేవత పేరు) పెట్టుకొని జరుపుకోవడం సమర్ధనీయమా? సెప్టెంబర్‌లోనో అక్టోబర్‌లోనో అసలు ఎప్పుడు పుట్టిండో తెలియని యేసు ప్రభువు పుట్టిన రోజును డిసెంబర్ 25న జరుపుకోవడం సమర్ధనీయమా? పూర్వ కాలం నుండి వస్తున్న ఒక అబద్ధపు ఆచారాన్ని మన సువార్త ప్రకటనకు వాడుకుంటే తప్పులేదంటారా?**

## క్రిస్మస్ & ఈస్టర్‌లు జరుపుకుంటే తప్పేంటి?

క్రిస్మస్ మరియు ఈస్టర్‌లు బైబిల్లో లేకున్నా మనం చేసుకుంటే తప్పేంటి? అన్య దేవతలను ఆరాధించడం లేదు కదా? మనం బైబిల్లో వున్నవన్నీ ఫాలో అవుతున్నామా? బైబిల్లోలేనివి ఎన్నో చేస్తున్నాము కదా? అన్నీ బైబిల్లో చెప్పబడతాయా? అయినా సువార్త చెప్పడానికే గదా? అధికారుల ముందు క్రీస్తును ఘనపరచడానికే గదా? ఇలా వుంటాయి మన వాళ్లు చెప్పే సాకులు.

ఒకసారి ఆలోచించండి! యేసు ప్రభువు పునరుత్థానానికి ‘ఈస్టర్’ అని సంబంధంలేని పేరు (పాగన్ దేవత పేరు) పెట్టుకొని జరుపుకోవడం సమర్ధనీయమా? సెప్టెంబర్‌లోనో అక్టోబర్‌లోనో అసలు ఎప్పుడు పుట్టిండో తెలియని యేసు ప్రభువు పుట్టిన రోజును డిసెంబర్ 25న జరుపుకోవడం సమర్ధనీయమా? పూర్వ కాలం నుండి వస్తున్న ఒక అబద్ధపు ఆచారాన్ని మన సువార్త ప్రకటనకు వాడుకుంటే తప్పులేదంటారా? ఒకసారి సౌలు చేసిన దానిని గురించి చదవండి;

1సమూయేలు 15:2-23: “సైన్యములకధిపతియగు యెహోవా సెలవిచ్చినదేమనగా -అమాలేకీయులు ఇశ్రాయేలీయులకు చేసినది నాకు జ్ఞాపకమే, వారు ఐగుప్తులోనుండి రాగానే అమాలేకీయులు వారికి విరోధులై మార్గమందు వారిమీదికి వచ్చిరి గదా. కాబట్టి నీవు పోయి కనికరింపక అమాలేకీయులను హతముచేయుచు, పురుషులనేమి స్త్రీలనేమి బాలురనేమి పసిపిల్లలనేమి యెద్దులనేమి గొఱ్ఱెలనేమి ఒంటెలనేమి గార్దభములనేమి అన్నిటిని హతముచేసి వారికి కలిగినదంతయు బొత్తిగా పాడుచేసి అమాలేకీయులను నిర్మూలము చేయుమని చెప్పెను. అంతట సౌలు జనులను

పోగుచేసి తెలాయీములో వారిని లెక్కపెట్టగా, కాలుబలము రెండు లక్షలమందియు యూదావారు పదివేలమందియు నుండిరి. అప్పుడు సౌలు అమాలేకీయుల పట్టణములలో నొకదానికి వచ్చి లోయలో పొంచియుండి –ఇశ్రాయేలీయులు ఐగుప్తులోనుండి వచ్చినప్పుడు మీరు వారికి ఉపకారము చేసితిరి గనుక అమాలేకీయులతోకూడ నేను మిమ్మును నాశనము చేయకుండునట్లు మీరు వారిలోనుండి బయలుదేరి పోవుడని కేనీయులకు వర్తమానము పంపగా కేనీయులు అమాలేకీయులలోనుండి వెళ్లిపోయిరి.

తరువాత సౌలు అమాలేకీయులను హవీలానుండి ఐగుప్తుదేశపు మార్గముననున్న షూరువరకు తరిమి హతముచేసి అమాలేకీయుల రాజైన అగగును ప్రాణముతో పట్టుకొని జనులనందరిని కత్తిచేత నిర్మూలము చేసెను, సౌలును జనులును కూడి అగగును, గొఱ్ఱెలలోను ఎడ్లలోను క్రొవ్విన గొఱ్ఱెపిల్లలు మొదలైన వాటిలోను మంచి వాటిని నిర్మూలము చేయక కడగా నుంచి, పనికిరాని నీచపశువులన్నిటిని నిర్మూలముచేసిరి. అప్పుడు యెహోవా వాక్కు సమూయేలునకు ప్రత్యక్షమై యీలాగు సెలవిచ్చెను –సౌలు నన్ను అనుసరింపక వెనుక తీసి నా ఆజ్ఞలను గైకొనక పోయెను గనుక అతనిని రాజుగా నిర్ణయించినందుకు నేను పశ్చాత్తాప పడుచున్నాను. అందుకు సమూయేలు కోపావేశుడై రాత్రి అంత యెహోవాకు మొఱ్ఱపెట్టుచుండెను. ఉదయమున సమూయేలు లేచి సౌలును ఎదుర్కొనుటకు పోగా సౌలు కర్మెలునకువచ్చి అక్కడ జయసూచకమైన శిలను నిలిపి తిరిగి గిల్గాలునకు పోయెనన్న సమాచారము వినెను. తరువాత అతడు సౌలు నొద్దకురాగా సౌలు –యెహోవా వలన నీకు ఆశీర్వాదము కలుగునుగాక, యెహోవా ఆజ్ఞను నేను నెరవేర్చితిననగా, సమూయేలు –ఆలాగైతే నాకు వినబడుచున్న గొఱ్ఱెల అరుపులును ఎడ్ల రంకెలును ఎక్కడివి? అని అడిగెను. అందుకు సౌలు –అమాలేకీయుల యొద్దనుండి జనులు వీటిని తీసికొనివచ్చిరి; నీ దేవుడైన యెహోవాకు బలులనర్పించుటకు జనులు గొఱ్ఱెలలోను ఎడ్లలోను మంచివాటిని ఉండనిచ్చిరి; మిగిలినవాటినన్నిటిని మేము నిర్మూలముచేసితిమనగా, సమూయేలు –నీవు మాటలాడ పనిలేదు. యెహోవా రాత్రి నాతో సెలవిచ్చిన మాట నీకు తెలియజేతును వినుమని సౌలుతో అనగా, సౌలు –చెప్పుమనెను. అందుకు సమూయేలు నీ దృష్టికి నీవు అల్పుడవుగా ఉన్నప్పుడు ఇశ్రాయేలీయుల గోత్రములకు శిరస్సువైతివి, యెహోవా నిన్ను ఇశ్రాయేలీయులమీద రాజుగా అభిషేకించెను. మరియు యెహోవా నిన్ను సాగనంపి –నీవు పోయి పాపాత్ములైన అమాలేకీయులను నిర్మూలము చేయుము, వారు లయమగువరకు వారితో యుద్ధము చేయుమని సెలవియ్యగా నీవు ఎందుచేత యెహోవా మాట వినక దోపుడు మీద ఎగబడి ఆయన దృష్టికి కీడు చేసితివనెను. అందుకు సౌలు –ఆ మాట అనవద్దు; నేను యెహోవా మాట విని యెహోవా నన్ను పంపిన మార్గమున పోయి అమాలేకీయుల రాజైన అగగును తీసికొనివచ్చితిని కాని అమాలేకీయులను నిర్మూలము చేసితిని. అయితే గిల్గాలులో నీ దేవుడైన యెహోవాకు బలి అర్పించుటకై జనులు శపితములగు గొఱ్ఱెలలోను ఎడ్లలోను ముఖ్యమైనవాటిని తీసికొనివచ్చిరని సమూయేలుతో చెప్పెను. అందుకు సమూయేలు –తాను సెలవిచ్చిన ఆజ్ఞను ఒకడు గైకొనుటవలన యెహోవా సంతోషించునట్లు, ఒకడు దహనబలులను బలులను అర్పించుటవలన ఆయన సంతోషించునా? **ఆలోచించుము, బలులు అర్పించుటకంటె ఆజ్ఞను గైకొనుటయు, పొట్టేళ్ల క్రొవ్వు అర్పించుటకంటె మాట వినుటయు శ్రేష్ఠము. తిరుగుబాటు చేయుట సోదెచెప్పుటయను పాపముతో సమానము; మూర్ఖతను అగపరచుట మాయావిగ్రహము గృహదేవతలను పూజించుటతో సమానము.** యెహోవా ఆజ్ఞను నీవు విసర్జింతివి గనుక నీవు రాజుగా ఉండకుండ ఆయన నిన్ను విసర్జించెననగా…”




పై సందర్భంలో చూసినట్లయితే, సౌలు తన స్వంత నిర్ణయంతో దేవునికి బలులర్పించడానికి అమాలేకీయుల గొఱ్ఱెలు, ఎడ్లను తీసుకొచ్చాడు. దాని పర్యవసానంగా దేవుడు

సౌలును విసర్జించాడు. అలాగే మోషే కూడా కోపంలో బండను కొట్టినందుకు కనాను దేశంలో అడుగుపెట్టనివ్వలేదు (సంఖ్యా 27:13,14). నిజానికి వాళ్లు చేసినవి చాలా చిన్నతప్పులుగానే అనిపిస్తాయి, కాని వారు పెద్ద శిక్షలే అనుభవించాల్సి వచ్చింది.

ఒక అబద్ధాన్ని ఆసరాగా చేసుకొని సత్యసువార్తను ప్రకటించాల్సిన అవసరం లేదు కదా? మనం ఏదో సంవత్సరానికి ఒకసారి క్రీస్తు జనన, మరణ, పునరుత్థానాలను ప్రకటించడం కాదు, ప్రతి రోజు మనం ప్రకటించాల్సిందే కదా! దేవుడు సంవత్సరానికి ఒకసారే సువార్తను ప్రకటించమనలేదు కదా?

రోమా 12:2 –**"మీరు ఈ లోక మర్యాదను అనుసరింపక, ఉత్తమమును, అనుకూలమును, సంపూర్ణమునైయున్న దేవుని చిత్తమేదో పరీక్షించి తెలిసికొనునట్లు మీ మనస్సు మారి నూతనమగుటవలన రూపాంతరము పొందుడి."**

***Source :*** ____________

*en.wikipedia.org/Easter*
*britannica.com/Easter-holiday*
*gotquestions.org/easter-origins*
*en.wikipedia.org/Beda_Venerabilis%27_Easter_cycle*
*en.wikipedia.org/Dionysius_Exiguus*
*en.wikipedia.org/Pope_Theophilus_of_Alexandria*
*en.wikipedia.org/Cyril_of_Alexandria*
*forteachersforstudents.com.au/site/themed-curriculum/easter/facts/*
*en.wikipedia.org/Lent*
*en.wikipedia.org/Christmas*
*britannica.com/Christmas*
*en.wikipedia.org/Hippolytus_of_Rome*
*en.wikipedia.org/Sol_(Roman_mythology)*
*en.wikipedia.org/solis invictus*
*en.wikipedia.org/elgabalus*
*en.wikipedia.org/elgabalus_(deity)*
*livius.org/articles/religion/elagabal*
*en.wikipedia.org/List_of_Roman_emperors*
*en.wikipedia.org/List_of_Roman_deities*

*(13వ పేజీ తరువాయి....)*

## యేసు ప్రభువు... సమాధి...

వాటి గురించి కూడా ఒకసారి తెలుసుకుందాం.

పాత యెరుషలేము పట్టణములోని క్రిస్టియన్ క్వార్టర్‌లో ఉన్న **'చర్చ్ ఆఫ్ హెూలీ సెపల్చర్'లో** క్రీస్తును సిలువ వేసిన గొల్గొతా ప్రదేశం మరియు ఖాళీయైన క్రీస్తు సమాధి ఉన్నట్టుగా చెప్పబడుతోంది. సున్నపురాయి సమాధిపై పాలరాతితో తాపడం చేశారు.

**రెండవ సమాధి,** క్రీ.శ. 1867లో యెరుషలేములోని సమాధుల తోట అనే ప్రాంతంలో కనుగొనబడింది. ఇది పూర్తిగా రాయిని తొలచి కట్టించిన సమాధి. ప్రొటస్టెంటు క్రిస్టియన్లు ఇదే నిజమైన యేసు సమాధిగా నమ్ముతారు.

**మూడవ సమాధి,** క్రీ.శ. 1980లో తూర్పు యెరుషలేములోని పాత పట్టణానికి దక్షిణంగా 5 కిలోమీటర్ల దూరంలో ఉన్న తూర్పు టాల్పియోట్ పరిసరాల్లో కనుగొనబడింది. ఇది కూడా రాతిని తొలచి కట్టించిన సమాధి. ఇందులో పది అస్థికలు, ఆరు శిలాశాసనాలు ఉన్నాయి. వాటిలో ఒకటి 'యేషువా బార్ యెహూసెఫ్' (యషువా, యోసేపు కుమారుడు) అని రాయబడి ఉంది. దాని ప్రక్కనే జూడాస్ అనే అతని కుమారుడు కూడా ఖననం చేయబడ్డాడు. దీన్ని బట్టి చూస్తే అది యేసు ప్రభువు సమాధి కాదని ఇట్టే తెలిసిపోతుంది.

**నాలుగవ సమాధి,** భారతదేశంలోని కాశ్మీర్‌లోని శ్రీనగర్ డౌన్‌టౌన్ ప్రాంతంలోని ఖన్యార్ క్వార్టర్‌లో 'రోజా బాల్' అనే మందిరం ఉంది. రోజా అనే పదానికి సమాధి అని అర్థం, బాల్ అంటే స్థలం అని అర్థం. అహ్మదీయ ఉద్యమ స్థాపకుడు మీర్జా గులాం అహ్మద్ 1899లో ఇది **'జీసస్ సమాధి'** అని ప్రకటించాడు. కాని స్థానిక సున్నీ ముస్లింలు 'యేసును సమాధి చేశారనే సిద్ధాంతం ఇస్లాం మతాన్ని దూషించడమే' అని చెప్తారు.

**ఐదవ సమాధి,** జపాన్‌లోని షింగో గ్రామంలో ఉందని సజిరో సవాగుచి కుటుంబీకులు నమ్ముతారు. జీసస్ యొక్క చివరి వారసులమని చెప్పే సజిరో సవాగుచి కుటుంబీకుల వాదనల ప్రకారం యేసు క్రీస్తు గోల్గొథాలో సిలువపై మరణించలేదని, బదులుగా అతని సోదరుడు ఇసుకిరి సిలువపై ఎక్కాడని, అయితే యేసు క్రీస్తు సైబీరియా మీదుగా ఉత్తర జపాన్‌లోని ముట్సు ప్రావిన్స్‌కు పారిపోయాడని చెబుతారు. జపాన్‌లో అతను తన పేరును తోరై తోరా దైటెంకుగా మార్చుకున్నాడు. రైతుగా మారి, మియుకో అనే ఇరవయ్యేళ్ల జపనీస్ మహిళను వివాహం చేసుకున్నాడు. ముగ్గురు కుమార్తెలను కని పెంచాడని, ఆ తర్వాత 106 సంవత్సరాల వయస్సులో మరణించాడని చెబుతారు. అతని శరీరం నాలుగు సంవత్సరాల పాటు కొండపైన ఉందని, ఆ కాలపు ఆచారాల ప్రకారం యేసు ఎముకలను సేకరించి, యేసు క్రీస్తు సమాధిగా భావించే మట్టి దిబ్బలో పాతి పెట్టారని చెబుతారు.



**Jeriah Bible Mission**

*Peddapalli, Telangana-505172*
*jeriahbiblemission@gmail.com*
*jeriahbiblemission.blogspot.com*
 7013 63 9470

పాఠకులకు మన ప్రభువైన యేసుక్రీస్తు నామములో వందనాలు....

మేము అందించే ఈ ఆర్టికల్స్ దయచేసి మీకు తెలిసిన ఇతర క్రైస్తవ సహోదరులకు షేర్ చేయండి. ఒకవేళ ఈ ఆర్టికల్స్‌కు సంబంధించి ఏమైనా మార్పులు, చేర్పులు సూచించడానికి మీరు ఇష్టపడినట్లయితే, మా దృష్టికి రానివి, అప్‌డేట్ చేయాల్సినవి ఏమైనా ఉంటే తప్పకుండా మాతో షేర్ చేసుకోగలరు. అలాగే ఏదైనా అంశానికి సంబంధించిన ఆర్టికల్ కోసం మీరు ఎదురు చూస్తున్నట్లయితే ఆ విషయాన్ని మాకు తెలియపరచినచో మా టీం సభ్యుల ద్వారా మీకు అందించే ప్రయత్నం చేస్తాం. అదేవిధంగా, మీ వద్ద ఏమైనా మంచి సాక్ష్యాలు, వాక్యానుసారమైన, పరిశోధనాత్మకమైన ఆర్టికల్స్ ఉన్నట్లయితే ఈ పత్రికలో ప్రచురించడానికి మీరు ఇష్టపడినట్లయితే మాకు పంపించి ఈ పరిచర్యలో పాలిభాగస్తులు కాగలరని ఆహ్వానిస్తున్నాము.

మరో ముఖ్యమైన విషయమేమంటే, మీరు నివసిస్తున్న పట్టణం, ప్రాంతంలో మొట్టమొదటి సారిగా ఎవరు సువార్త ప్రకటించారో, వారి గురించి, వారి పరిచర్య గురించి వివరాలు సేకరించి మాకు పంపించగలరు. వీలైతే వారి ఫోటోలు కూడా సేకరించండి. మన ప్రాంతాల్లో మన దైవజనులు ఎంతో మంది సువార్త పరిచర్య చేసి సంఘాలను స్థాపించారు. మనం మన చరిత్రను వ్రాసుకునే అలవాటు లేకపోవడం వలన వారి సువార్త పరిచర్య వివరాలు ఎవరికీ తెలియకుండా పోయాయి. ఇకమీదటనైనా వారి పరిచర్య వివరాలు వెలుగులోనికి తీసుకొనిరావడానికి మనవంతు ప్రయత్నం తప్పకుండా చేద్దాం!

ఈ పత్రికా పరిచర్య దేవునికి మహిమకరంగా ఉండునట్లు ప్రార్థించండి. అలాగే మీ యొక్క సహాయ, సహకారాలు మాకు తప్పకుండా అందించండి! దేవుని కృప ఎల్లవేళలా మనకందరికి తోడైయుండి కాచి కాపాడి నడిపించును గాక! ఆమేన్.

- జెరియా బైబిల్ మిషన్